    

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీకృష్ణలీలలలోని వేదాంతతత్త్వాలు

**09-09-2023**



గోపాలకృష్ణ పెరుమాళ్, తిరుకావలంబాడి




'పండితరత్న'
డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అగ్గ్రగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 1

శ్రీకృష్ణుడు ఉత్తర మధురా నగరంలో జన్మించాడు ఉదాదేవి శ్రీకృష్ణుని నిర్దేశించేటప్పుడు తిరుప్పావై ప్రబంధంలోని ఐదవ పాశురంలో "మన్ను వడ మదురైమైన్దనై" అని అన్నది. లోకవ్యహారంలో "వడ మదురై, తెన్మదురై" అనే వ్యవహారాలు ఉన్నాయి. "వడ మదురై", అంటే ఉత్తర భారతంలో ఉండే మధురానగరం. "తెన్మదురై" అంటే దక్షిణ భారతంలో ఉండే మధురానగరం. ఈ వ్యవహారాలలో సామాన్యంగా "వడ" శబ్దానికి ఉత్తరమని, "తెన్" అనే శబ్దానికి దక్షిణమనే అర్థాలను గ్రహించడం అనేది సామాన్యంగా ఉన్నది. కానీ, ఇక్కడ కేవలం దిక్కులను దృష్టిలో పెట్టుకొని ఉత్తరంలో ఉన్నది "వడ మధురై" అని, దక్షిణంలో ఉన్నది "తెమ్మదురై", అనే అర్థంలో అళ్వారుల సూక్తులలో ప్రయోగింపబడలేదు. ఇంతకంటే, విలక్షణమైన, గంభీరమైన వేరొక అర్థం ఈ విశేషణాలకు పెద్దలు తెలియజేశారు.

తిరుప్పావై ప్రబంధంలోని ఐదవ పాశురాన్ని గమనించి చూడండి. గోదాదేవి "మాయనై వడ మధురై మైందనై" అని మాత్రమే చెప్పలేదు. "మన్ను వడ మధురై మైందనై" అని అన్నది. ఇక్కడ "మన్ను" అనే పదం భగవంతుడు ఎప్పుడూ ఆ మధుర నగరంతో స్థిరమైన సంబంధం కలిగి ఉండే అర్థాన్ని సూచిస్తున్నది– అని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. అంటే, ఉత్తర మధురా నగరం భగవంతునితో విడదీయరాని అవినాభావ సంబంధం కలిగినది అని అర్థం. భగవంతుడు ఉత్తర మధురా నగరంలో ఏ విధంగా స్థిరమైన సంబంధాన్ని కలిగి ఉన్నాడు ? అని అంటే, వటంవలె మన్నికగా స్థిరంగా ఉన్నాడు– అని భావం. సంస్కృత భాషలోని వ శబ్దం ద్రావిడ భాషలో వడం అని మారుతుంది. వటవృక్షం అంటే, మర్రిచెట్టు. వటవృక్షం వేళ్ళు బాగా భూమిలో లోపలికి ఊనుకొని, చాలా దూరానికి వ్యాపిస్తాయి. అందువల్ల ఇక్కడ, వటవృక్షం ఏ విధంగా భూమితో స్థిరమైన, విస్తృతమైన, విశాలమైన, బలమైన సంబంధాన్ని కలిగి ఉంటుందో, ఆ విధంగానే శ్రీకృష్ణుడు ఈ ఉత్తర మధురా నగరంతో స్థిరమైన, విస్తృతమైన, విశాలమైన, బలమైన సంబంధాన్ని కలిగి ఉన్నాడు– అనిఏవిశేషమైన అర్థం ఈ "మన్ను వడ మదురై", అనే ప్రయోగం ద్వారా ధ్వనిస్తున్నది.

భగవంతుడు అనేక విధాలుగా ఆ నగరంతో స్థిరమైన సంబంధాన్ని కలిగి ఉన్నాడు ఈ మధురానగరంలోనే ధ్రువుడు తపస్సు చేశాడు. భగవంతుడు అతని దగ్గరకు వచ్చి సాక్షాత్కరించి అనుగ్రహించినది ఈ నగరంలోనే. భగవంతుడు వామనావతారాన్ని

స్వీకరించినప్పుడు ఈ ఉత్తర మధురా గరంలోనే ఒక ప్రదేశంలో కొంతకాలం తపస్సు చేశాడు– అని పురాణాలకు తెలుపుతున్నాయి. ఆ ప్రదేశానికి సిద్ధాశ్రమం అని పేరు. శ్రీరామావతార కాలంలో ఈ ప్రదేశం మధువనం అనే పేరుతో అరణ్యప్రాంతంగా ఉన్నది. శ్రీరాముడు శత్రుఘ్నుని ఈ ప్రాంతానికి పంపించి, ఇక్కడ ఉండే లవణాసురుని సంహరింప చేశాడు. ఆ తరువాత శత్రుఘ్నుడు ఈ ప్రాంతాన్ని మధురానగరంగా తీర్చిదిద్దాడు. ఇక, శ్రీకృష్ణావతార సమయంలో భగవానుడు ఈ నగరంలోనే అవతరించాడు కదా. ఈ విధంగా ఉండే విశేషాలు అన్నీ స్ఫురించేటట్లుగా గోదాదేవి "మన్ను వడమదురై" అనే విలక్షణమైన ప్రయోగాన్ని చేసింది. మర్రి చెట్టు ఏ విధంగా అది మొలచిన చోట వేళ్ళతో స్థిరమైన, విస్తృతమైన, గాఢమైన సంబంధాన్ని కలిగి ఉంటాయో, ఆ విధంగా భగవానుడు స్థిరమైన గాడమైన సంబంధాన్ని కలిగి ఉంటాడు– అని తాత్పర్యం.

ఇదే విధంగానే, "తెన్ మధురై" అనే ప్రయోగం కూడా విలక్షణమైనది. ఈ ప్రయోగానికి దక్షిణ దిక్కులో ఉండే మధురానగరం–< అని మాత్రమే అర్థం కాదు. ద్రావిడ భాషలో "తెన్" అఅనే పదానికి అందమైన అని అర్థం. (ఆంధ్ర భాషలో కూడా ఈ "తెన్" పదానికి ఉన్నది. తెనుగు అనే పదాన్ని "తెన్+గు" కానీ విడదీసి, అందమైన భాష అనే అర్థాన్ని భాషాశాస్త్రజ్ఞులు చెబుతున్నారు కదా. ) అందువల్ల, "తెన్ మధురై" అనే పదానికి "అందమైన సుందరమైన మధురానగరం", – అని అర్థం. మధురానగరంవలె అందమైన ఇంకొక నగరం ఈ భూమండలంలో లేదని చెప్పాలి ఈ నగరం పేరు మధురానగరం అని ఉండడమే ఈ అర్థాన్ని సూచిస్తున్నది. ఈ మధురానగర ప్రాంతంలో, ఈ నగరం నెలకొని ఉండే పాండ్య మండలంలో వ్యవహరించే ద్రావిడ భాష కూడా చాలా అందమైన, మధురమైన సహజమైన ద్రావిడ భాష అని ద్రావిడభాషా శాస్త్రజ్ఞులు చెబుతారు. అందమైన ద్రావిడ భాషాసుగంధం పరిమళించే ప్రాంతం మధురానగర ప్రాంతం. అంతే కాదు, ఈ మధురానగరం కూడా చాలా అందమైనది. ఇంతకుమించి, ఇక్కడ నెలకొని ఉండే స్వామికూడా చాలా అందమైనవాడు అనే పేరు ఉన్నది. ఊరి లోపల ఉండే స్వామికి కూడలఘగర్ అని పేరు. ఊరికి బయట కొండమీద ఉండే స్వామికి కళ్ళఘగర్ అనే పేరు. ఇక్కడ ఉండే శివునకు చొక్కనాథుడు, సుందరేశ్వరుడు అని పేరు. ఇక, ఇక్కడ ఉండే మీనాక్షి దేవి అందాన్ని గూర్చి చెప్పవలసిన పనిలేదు.

నీలకంఠదీక్షితుడు అనే మహా పండితుడు మీనాక్షి దేవి భక్తుడు. అతడు శివ లీలార్ణవం అనే ఒక స్తుతి కావ్యాన్ని సంస్కృతభాషలో రచించాడు. ఆ కావ్యంలో మీనాక్షి దేవి

వల్ల గంగానది మహిమను పొందుతున్నది –అని ఆయన అన్నారు. ఎందుకంటే, ఈ గంగానదీ జలాలు మీనాక్షి దేవి పాదాలను స్పృశిస్తున్నవట. అదేమి? ఇక్కడ ఉండే నది వేగైనది కదా– అని అంటే, దానికి ఒక కారణాన్ని ఆ కవి ఏమని చెప్పారంటే, గంగానది త్రివిక్రమ స్వామిపాదసంబంధాన్ని కలిగి ఉన్నందున, సహజంగా చాలా పవిత్రమైనది. అది శివుని తలను చేరింది. మీనాక్షీ దేవి నివసించే ప్రాంతం కదా మధురా నగరం. ఎప్పుడైనా, ఒక సమయంలో మీనాక్షి దేవికి సుందరేశ్వరనకు మధ్య ప్రణయ కలహం సంభవించినప్పుడు, ఆ సుందరేశ్వరుడు తనను మన్నించమని ప్రేమతో ఆ మీనాక్షిదేవి కాళ్ళ దగ్గర తన తలను వంచుతాడట. అప్పుడు శివుని తలలో ఉండే గంగానదీ జలాలు మీనాక్షి దేవి పాదాలను తాకుతాయి. ఆ విధంగా ఆ మీనాక్షీ దేవి పాద సంబంధాన్ని పొందిన గంగానది మరింత పవిత్రతను పొందింది– అని నీలకంఠ దీక్షితులు చాలా అందంగా పలికారు.

ఈ విధంగా ఉత్తరమధురా నగరంలో అవతరించిన, సుందరుడైన మధురాధిపతి శ్రీకృష్ణుడు చేసిన అత్యంత మధురమైన లీలలలో స్ఫురించే మధురాలయిన వేదాంత విషయాలను కొన్నిటిని ఇప్పుడు గమనిద్దాం.

శ్రీకృష్ణుడు చేసిన ప్రతి లీలలోను ఒక విలక్షణమైన మధురమైన వేదాంతతత్త్వం గోచరిస్తుంది. ఈ విషయాన్ని భగవద్రామానుజులు తమ గీతాభాష్యం అవతారికలో తెలియజేశారు. వారు అక్కడ ఏమి చెప్పారంటే, "భూభారావతరణాపదేశేన అస్మాదీనామపి ఆశ్రయణీయత్వాయ అవతీర్య, సకలమనుజనయన విషయతాంగతః పరావరనిఖిల జనమనోనయనహారి దివ్య చేష్టితాని కుర్వన్" అనే ఒక విలక్షణమైన సూక్తిని ప్రసాదించారు. భగవంతుడు శ్రీకృష్ణుడుగా ఉత్తర మధురా నగరంలో అవతరించి ఎన్నో లీలలను చేశాడు. ఈ భూమిలో అవతరించేటప్పుడు అతడు "భూభారాన్ని తొలగించడం కోసం నేను అవతరిస్తాను" అని చెప్పి అవతరించాడు. అయితే, అతడు తావన్మాత్రంతో ఊరుకోలేదు. ఎన్నో విధాలయిన అందమైన లీలలను చేశాడు. " పరావరనిఖిల జనమనోనయనహారి దివ్య చేష్టితాని కుర్వన్"– పరూలంటే, చక్కని జ్ఞానాన్ని కలిగిన పండితులు. అవరులంటే, విశేషమైన జ్ఞానం లేని సామాన్యులు. "భగవంతుని పూజించాలి నమస్కరించాలి" అని మాత్రమే తెలిసిన సామాన్యులు. ఈ విధంగా ఉండే అందరిని ఏ రీతిలో ఆకర్షించి ఆకట్టుకోవాలి? అని ఆలోచించి, ఈ విధంగా అందరి మనసులను ఆకట్టుకునే దివ్యమైన మధురమైన లీలలను శ్రీకృష్ణ భగవానుడు చేశాడు–అని శ్రీరామానుజుల వారు అన్నారు.

పండితుల మనసులను ఆకర్షించాలి, పామరుల నేత్రాలను ఆకట్టుకోవాలి. పామరుల మనసు అంత త్వరగా భగవద్విషయంలో అభినివేశాన్ని పొందదు. అందువల్లనే శ్రీరామానుజులు "పరావర నిఖిల జన మనోనయన హారి దివ్యచేష్టితాని"అని అన్నారు. వరులను మొదటగా వారి చూపులను ఆకర్షించి, తద్ద్వారా వారి మనసులను ఆకట్టుకోవడానికి సాధ్యమవుతుంది తప్ప, ప్రారంభంలోనే వారి మనసులను ఆకట్టుకోవడం సాధ్యం కాదు. ఈ విధంగా అందరినీ ఆకర్షించాలంటే దివ్యమైన లీలలను చేయాలి కదా. "ఆహా! శ్రీకృష్ణుడు కూడా ఈ విధంగా ఆడుస్తున్నాడే! మన కుర్రవాడే విధంగా ఆడుతున్నాడు– అని అనుకుంటున్నాము. కానీ, భగవంతుడు అవతరించి ఈ విధంగా లీలలను చేస్తున్నాడు. సామాన్య బాలకులవలె వెన్నను దొంగిలిస్తున్నాడు. ఈ విషయమేమో చూద్దాం. శ్రీకృష్ణుడు 5 లక్షలమంది గోపికలతో రాస క్రీడను ఆడుతున్నాడే! . ఈ చోద్యమేమో చూద్దాం. " అని భావించిన పామరుల దృష్టి భగవంతుని లీలలపై లగ్నమవుతుంది. అందువల్ల భగవంతుడు ఈ విధమైన దివ్యలీలలను చేశాడు వేరొక వైపు. ఈ లీలలో గొప్ప గొప్ప వేదాంత తత్త్వాలు స్ఫురించేటట్లు చేశాడు. ఎందుకంటే, పండితులు ఈ శ్రీకృష్ణుని లీలలను దర్శించినప్పుడు "ఆహా! స్వామి చేసే ఈ లీలలు మహనీయమైన ఉపనిషత్తులలోని అర్థాలు ఉన్నాయే! ఉపనిషత్తులను మనం ప్రతి దినం అధ్యయనం చేస్తూ ఉన్నాము. వాటిలోని అర్థాలు మనకు మనస్సుకు బాగా పట్టలేదు. కానీ, ఇప్పుడు ఈ శ్రీకృష్ణ భగవానుడు చేసే దివ్య లీలలను నిశితంగా గమనించినప్పుడు, వీటిలో చాలా గొప్ప గొప్ప వేదాంత తత్త్వాలు తెలుస్తున్నాయే! " అనే పండితులు కూడా తమ మనసులలో చాలా ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని పొందుతాడరు. ఈ విధంగా స్వామి తన లీలలతో పామరుల మనసులను, పండితుల మనసులను ఆకర్షిస్తాడు. అందువల్ల, "పండితుల మనసులను ఆకరించించాలి, పామరుల చూపులను ఆకట్టుకోవాలి. దీనికి తగిన దారి ఏమి?" అని ఆలోచించి శ్రీకృష్ణ భగవానుడు ఈ విధంగా మధురమైన దివ్యమైన లీలలను ప్రదర్శించాడు.

శ్రీకృష్ణ భగవానుడు ప్రదర్శించిన లీలలు ఎన్ని? అని లెక్క గట్టి చెప్పడానికి సాధ్యం కాదు. అందువల్ల ఇప్పుడు కేవలం 20 శ్రీకృష్ణ లీలలను మాత్రం గ్రహించి, వాటిలోని రమ్యమైన వేదాంత తత్త్వాలను గ్రహిద్దాం.

ముందుగా, మొదటి లీల, శ్రీకృష్ణ భగవానుని అవతార లీల. ఈ లీలలోనే గొప్పతత్త్వాలు ఇమిడి ఉన్నాయి. శ్రీకృష్ణుడు ఆవణి మాసం రోహిణీనక్షత్రంలో, బహుళాష్టమి తిథిలో, మధ్యరాత్రి సమయంలో కంసుని సమీపంలో దేవకీ వసుదేవులకు

కుమారుడై అవతరించాడు. భాగవత పురాణంలో ఈ సందర్భాన్ని శుకమహర్షి " తమ అద్భుతం బాలకమంబుజేక్షణం చతుర్భుజం శంఖ గదాద్యుదాయుధమ్, శ్రీవత్సచిహ్నం గళ శోభికౌస్తుభం పీతాంబరం సాంద్రపయోద సౌభగమ్" అని వర్ణించారు. " ఈ లీలను పెరియాళ్వార్లు తమ దివ్య ప్రబంధంలో " వణ్ మాడంగళ్ శూழ் తిరుక్కోట్టియూర్, కణ్ణన్ కేశవన్ నంబి పిఱందినిల్, ఎణ్ణెయ్ శుణ్ణమ్ ఎదిరెదిర్ తూవిడ కణ్ణన్ ముற்றమ్ కలందళరాయ్ ற்றே" అని స్తుతించారు.

శ్రీకృష్ణుడు అవతరించినప్పుడు నాలుగు భుజాలతో అవతరించాడు. ఆ నాలుగు బాహువులలో చక్రం, శంఖం, గద, తామర పువ్వు అనే వీటిని ధరిస్తూ అవతరించాడు. పైన ఉండే రెండుబాహువులలోని కుడి బాహువులో చక్రం, ఎడమ బాహువులో శంఖం, ఆ విధంగానే, క్రింది బాహువులలోని, ఎడమ బాహువులో తామర పువ్వు, కుడి బాహువులో గద– అనే వీటిని ధరించి అవతరించాడు.

భగవంతుడు తలిస్తే, రెండు బహవులను కలిగినవాడై అవతరించవచ్చు. ఎనిమిది బాహువులత అవతరించవచ్చు. లేక, వేయి బాహువులను కలవాడై అవతరించవచ్చు. ఎందుకు ఈ విధంగా నాలుగు బాహువులను కలిగినవాడై అవతరించాడు? అని అంటే, మన జీవితంలో మనం సాధించవలసిన పురుషార్థాలు ధర్మం, అర్థం, కామం, మోక్షం– అని నాలుగు ఉన్నాయి. జీవించి ఉండేటప్పుడు ధర్మమార్గంలో జీవనయానం, ధర్మాన్ని అనుసరించి ద్రవ్య సంపాదన, ఆ ధనాన్ని ఉపయోగించి ధర్మానుగుణంగా సుఖాలను పొందడం, జీవితం చివరిలో మోక్షాన్ని పొందడం– అనే ఈ నాలుగు పురుషార్దాలను నాలుగు చేతులతో ప్రదానం చేయడం కోసమే ఈ విధంగా నాలుగు బాహువులను కలవాడనై నేను అవతరించాను– అనే తత్త్వాన్ని తెలియజేయడం కోసమే ఈ విధంగా అవతారాన్ని నాలుగు భుజాలతో అవతారాన్ని ఎత్తాడు. "ఈ ధర్మార్థ కామమోక్షాలు లు నాలుగింటిలో నీకు ఏది కావాలన్నా, నన్ను అడుగు నేను ఇస్తాను" అని తెలియజేశాడు.

ఇదే కాదు, అతడు ఏ విధంగా ఉన్నాడు అంటే, – "అంబుజేక్షణమ్"– తామర పువ్వుల వంటి నేత్రాలను కలవాడై వచ్చాడు. ఈ విధంగా అవతరించడంలో కూడా ఒక వేదాంత తత్త్వం ఉన్నది. లోకంలో చాలా పువ్వులు ఉన్నాయి. కానీ, ఎందుకు తామర పువ్వుతో భగవంతుని నేత్రాలను ఉపమించి చెప్పాలి? ఈ విధంగా తామర పూల వంటి నేత్రాలను భగవానుడు కలిగి ఉండడం కేవలం శ్రీకృష్ణావతారంలో మాత్రమే కాదు, శ్రీరాముని గూర్చి చెప్పేటప్పుడు కూడా "రామః కమల పత్రాక్షః "అని వాల్మీకి మహర్షి

అన్నాడు. మత్స్యావతారం ఎత్తినప్పుడు, చేపకు ఉండే కళ్ళువంటి కళ్ళతో కదా అవతరించాలి ఆ విధంగా అవతరించలేదు. " "మత్స్యః కమల లోచనః " అనే విధంగా అవతరించాడు. వరాహావతారాన్ని ఎత్తినప్పుడు, వరాహానికి ఉండే నేత్రాలను కలిగినవాడై అవతరించలేదు. "మహావరాహః స్ఫుటపద్మలోచనః" అని చెప్పినట్లుగా తామర పువ్వుల వంటి నేత్రాలను కలవాడై అవతరించాడు. నరసింహావతారాన్ని ఎత్తినప్పుడు, సింహనేత్రాలను కలవాడై కదా అవతరించాలి. కానీ, " సరోజసదృశా దృశా" అని దయాశతకంలో దేశికులవారు పలికినట్లుగా, తామర పువ్వులవంటి నేత్రాలతో అవతరించాడు. ఎందుకు భగవానుడు ఈ విధంగా అన్ని అవతారాలలోనూ తామర పువ్వులవంటి నేత్రాలను కలవాడై అవతరించాడు? అని అంటే, తామర పువ్వు బురదలో పుడుతుంది అందువల్లే దానికి పంకజం అని పేరు. కానీ, ఆ విధంగా బురదలో పుట్టినప్పటికీ, దాని వికాసంలో ఏ విధమైన లోటు ఉండదు. ఆ విధంగా ఈ సంసారం అనేది ఒక పంకం, ఒక బురద. భగవంతుడు శ్రీవైకుంఠం నుండి దిగివచ్చి, బురద వంటి ఈ సంసారంలో అవతరించినప్పటికీ కూడా, ఆ స్వామికి కల మహిమ ఏమాత్రం తగ్గదు. బురదలో పుట్టిన తామర పువ్వు వికాసంలో ఏ లోటు లేకుండా ప్రకాశించినట్లుగా, హేయమైన ఈ సంసారంలో అవతరించినప్పటికీ కూడా, భగవంతుని వైభవానికి ఏ విధమైన సనుకోచం కలుగదు అనే విషయం దీనివల్ల సూచింపబడింది. గీతలో భగవంతుడు స్వయంగా ఈ విషయాన్ని "అజో ఽ పి సన్ అవ్యయాత్మా భూతానా మీశ్వరో ఽ పి సన్, ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా", అని అంటూ "నేను అవతరించేటప్పుడు నా శక్తికి, వైభవానికి ఏ లోటు రాకుండానే అవతరిస్తాను" అని అన్నాడు. ఈ విషయాన్ని ఇక్కడ తామర పువ్వులవంటి నేత్రాలను స్వామి కలిగి ఉండడం సూచిస్తున్నది. ఈ లోకంలో అవతరించిన ఈ లోకంలో ఉండే దోషాలు ఏమి పరమాత్మకు అంటవు– అనే విశిష్టమైన తత్త్వం ఇక్కడ వ్యక్తం అయింది. తామర ఆకుకు నీరు ఎంత మాత్రం అంటదు. ఆ విధంగానే, భగవంతుడు సంసారంలోని దోషాలు సంక్రమించవు.

ఇక్కడ వేరొక వేదాంతతత్త్వం కూడావ్యక్తం అవుతున్నది. చాందోగ్యం భగవంతుని దివ్యమంగళ విగ్రహాన్ని వర్ణిస్తూ "తస్య కప్యాసం పుండరీకమే మక్షిణీ" అని అంటూ భగవంతుని నేత్రాలు నిండైన నీటిలో పుట్టిన, బలమైన కాడను కలిగిన, వికసింపబడిన అందమైన తామర పూలవంటివి– అని చెప్పింది ఆ వ వైదికతత్త్వం ఇక్కడ

ప్రకాశిస్తున్నది. పాతాత్తు భగవానుడే ఈ విధంగా శ్రీకృష్ణ బాల కొని రూపంలో అవతరించాడు– అని వ్యక్తం అవుతున్నది.

అంతే కాదు, శ్రీకృష్ణుడు అవతరించేటప్పుడు వక్షఃస్థలంలో లక్ష్మిని కలవాడై అవతరించాడు. ఈ విషయాన్ని పై శ్లోకంలో కల "శ్రీవత్సచిహ్నామ్" అనే పదం సూచిస్తున్నది. లక్ష్మిసహితుడైన భగవంతునే మనం ఎల్లప్పుడూ సేవించాలి. కేవలం భగవంతుని కానీ, కేవలం లక్ష్మీదేవిని కాని సేవించడం, ఆశ్రయించడం సంప్రదాయం కాదు. లక్ష్మీసహితుడైన భగవంతుని సేవించినప్పుడే, మనకు ఏ పురుషార్థం అయిన సులభంగా సిద్ధిస్తుంది. ఈ తత్త్వాన్ని శ్రీకృష్ణుడు లక్ష్మీసహితుడై అవతరించడం తెలుపుతుంది.

ఆ విధంగానే, ఇంకొక విషయాన్ని ఇక్కడ గమనించవచ్చు శ్రీకృష్ణుడు అవతరించినప్పుడు నీలమేఘశ్యాముడై అవతరించాడు. ఈ విషయాన్ని పై శ్లోకంలోని "సాంద్రపయోదసౌభగమ్" అనే ప్రయోగం తెలుపుతున్నది. నీలమేఘం ఎటువంటి రంగును కలిగి ఉంటుందో, అటువంటి వర్ణాన్ని కలిగినవాడై శ్రీకృష్ణుడు అవతరించాడు ఎందుకంటే, "నల్లని మేఘం ఏ విధంగా అయితే పుష్కలంగా నీటిని వర్షిస్తుందో, ఆ విధంగానే, నీ పైన నేను పుష్కలంగా కరుణను కురిపిస్తాను" అని సూచిస్తూ ఈ విధంగా శ్రీకృష్ణ భగవానుడు మేఘవర్ణుడై అవతరించినాడు. శ్రీకృష్ణుడు అవతరించినప్పుడు అతని రూపంలోనే ఇన్ని వైదికతత్త్వాలు వ్యక్తం అయినవి.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 2

శ్రీకృష్ణుడు అవతరించగానే దేవకీదేవి ఈ విధంగా ప్రార్థించింది. "స్వామీ నీవు నాలుగు భుజాలను కలిగిన రూపాన్ని ధరించి అవతరించి, నీ తత్త్వాలను అన్నిటిని నీ రూపంలోవ్యక్తం చేశావు. ఈ కంసుడు పరమక్రూరుడు. నా ఎనిమిదవ సంతానం ఎప్పుడు పుడుతుందా? ఎప్పుడు వధిద్దామా? అని ఎదురు చూస్తున్నాడు. నీవు ఈ విధంగా నాలుగు భుజాలతో శంఖచక్రాలను కలవాడవై ఉంటే, నీవు నారాయణుడవు అనే విషయాన్ని అతడు తెలిసికొంటాడు కదా. అందువల్ల నీవు లోక సామాన్యమైన రెండు చేతులను కలిగిన రూపంతో సాక్షాత్కరించు" అని వేడింది. ఆమె ప్రార్థనను మన్నించి భగవానుడు రెండు చేతులను కల రూపంతో మార్పును పొందాడు.

భగవంతుడు సర్వతంత్రస్వతంత్రుడు. నిరంకుశమైన అధికారాన్ని కలవాడు. ఎవరి మాటను లెక్క చేయవలసిన అక్కర లేనివాడు. అటువంటి స్వామి దేవకీదేవి ప్రార్థించగానే ఆమె కోరిక ప్రకారం తన రూపాన్ని మార్చుకున్నాడు. ఈ సందర్భం ఏ తత్త్వాన్ని వ్యక్తం చేస్తుంది?. అని అంటే, భగవంతుడు ఎంత స్వతంత్రుడైనా భక్తపరాధీనుడు. భక్తుడు చెప్పిన మాటను జవదాటడు. ఈ విధంగా అతడు చేయడం భక్తులపై అతనికి ఉండే వాత్సల్యాన్ని తెలియజేస్తున్నది. ఈ విధంగానే భక్తిసారమునీంద్రులు చెప్పిన మాటను అనుసరించి స్వామి వారి వెంట వెళ్లిపోయాడు కదా. మళ్లీ తనతో రమ్మని ఆ దివ్యసూరి అన్నప్పుడు ఆ విధంగానే వారితో తిరిగి వచ్చాడు కదా. అందువల్ల "శొన్న వణ్ణమ్ శెయ్ ద పెరుమాన్" (భక్తుడు చెప్పినట్లుగా చేసిన స్వామి) అనే పేరును పొందాడు కూడా తరువాత, తన తండ్రి అయిన వసుదేవుని చూసి శ్రీకృష్ణుడు "తండ్రీ! నన్ను ఇప్పుడే తీసుకొని పోయి రేపల్లెలోని నందగోపుని ఇంటికి చేర్చు. అక్కడ దుర్గాదేవి యోగమాయ యశోదాదేవికి కుమార్తెగా జన్మించింది. ఆమెను ఇక్కడకు తీసుకొని రా" అని అన్నాడు. అప్పుడు వసుదేవుడు నేను ఇప్పుడు కారాగారంలో బంధింపబడి ఉన్నాను. బయటకు వెళ్లే అవకాశం లేదు. అంతే కాక, దారిలో యమునానది అడ్డు ఉన్నది. రేపల్లె ఇక్కడికి దూరంలో ఉన్నది. నేను ఏ విధంగా నిన్ను తీసుకొని రేపల్లెకు వెళ్లగలను?" అని అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు "తండ్రీ! నన్ను ఎత్తుకొని వెళ్ళు, నీ మార్గం సుగమం అవుతుంది"అని అన్నాడు. సంకెళ్ళతో బంధింపబడిన వసుదేవుడు వెంటనే ఆ శ్రీకృష్ణుని తన చేతులతో పైకి ఎత్తుకున్నాడు. మరుక్షణమే అతని చేతులకు, కాళ్లకు ఉండే బంధాలు అన్ని సడలిపోయాయి. కారాగార గృహం తలుపులు తెరుచుకున్నాయి. అక్కడ ఉండే కావలి

వారు నిద్రలోకి జారుకున్నారు. యోగ మాయ అయిన దుర్గాదేవి తన ప్రభావంతో వారిని నిద్రపోయేటట్లు చేసింది. ఈ సందర్భాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో "ఒరుత్తి మగనాయ్ పిఱందు ఓరిరవిల్ ఒరత్తి మగనాయ్ ఒళిత్తు వళర" (అద్వితీయమైన రాత్రిలో దేవకీ దేవికి పుత్రుడై జన్మించి ఆ రాత్రి వేళలోనే యశోదకు పుత్రుడై రహస్యంగా పెరిగిన అని కీర్తించినది. "ఓరిరవిల్" అంటే, అద్వితీయమైన రాత్రిలో అని అర్థం. ఆ రాత్రి అద్వితీయమైనది ఎందుకు అయినది? అంటే, ఆ రాత్రివేళ ఈ జగత్తులో నలుగురే మేలుకొని ఉన్నారు. వారెవరు అంటే, దేవకీ దేవి, వసుదేవుడు దుర్గ, శ్రీకృష్ణుడు అనే నలుగురు మాత్రమే. మిగిలిన అందరూ నిద్రపోయారు. అందుచేత అది అద్వితీయమైన రాత్రి అని చెప్పదగినది. ఈ సందర్భంగా ఒక తత్త్వాన్ని గమనించవచ్చు భగవంతుని నమ్మినట్లయితే, కం అడ్డురాదు భగవానుడు అచ్యుతుడు భక్తుల చేతిని ఏనాడు విడువనివాడు. వసుదేవుడు శ్రీకృష్ణుని మాటలను నమ్మి ఆ స్వామిని చేతిలోకి ఎత్తుకోగానే అతని చేతులకు కాళ్లకు ఉండే బంధాలు అన్నీ ఊడిపోయాయి. ఈ విషయాన్ని భగవంతుడు భగవద్గీతలో "కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" (అర్జునా! ఏనాడు నా భక్తుడు నశించడు అని నీవు శపథం చేయి) అని అంటూ తెలియజేశాడు.

ప్రకృతి రూపమైన జగన్మాయ భగవానుడు చెప్పినట్లుగా తాను రేపల్లెలో యశోదా దేవికి కుమార్తెగా జన్మించడం, శ్రీకృష్ణ భగవానుడు అవతరించే సమయానికి జగత్తులో ఒక్క నలుగురు తప్ప మిగతా అందరూ నిద్రపోయేటట్లు చేయడం– ఇది అంతా భగవంతుని నియమన ప్రకారంగా జరిగింది. వేదాంతా. లు ప్రకృతి భగవంతునకు లీలోపకరణం అని, ఆ భగవంతుని అధీనంలో ఉండేది అని "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" అని తెలిపింది. ఈ తత్త్వాన్ని ఇక్కడ గ్రహించాలి.

వసుదేవుడు శ్రీకృష్ణుని తన చేతులతో ఎత్తుకోగానే, అతని కాళ్ళకు, చేతులకు ఉండే సంకెళ్లు వాటికి అవే ఊడిపోయాయి. ఈ సందర్భం ఏ విధమైన వేదాంతతత్త్వాన్ని తెలియజేస్తున్నది ? అని అంటే, భగవంతుడు అవతరించినది ఈ జీవుల సంసార బంధాన్ని లేకుండా చేయడం కోసమే అని ఇక్కడ సూచింపబడింది. ఇక్కడ సంకెళ్లు అంటే, జన్మ మరణ రూపమైన సంసారమే. సంసావరులమైన మనం మన పూర్వజన్మ కర్మలు అనే సంకెలతో బంధింపబడి, జన్మ అనే కారాగారంలో బంధింపబడి ఉన్నామ్. "జన్మ అనే కారాగారం నుండి పూర్వజన్మ కర్మలు అనే సంకెళ్ళనుండి మిమ్ములను నేను విడిపించి ముక్తిపదానికి చేరుస్తాను" అని భగవానుడు సూచించడమే ఈ లీలలోని తత్త్వం.

అటువంటి తత్త్వాన్ని వసుదేవుని సంకెళ్లను ఊడిపోయేటట్టు చేసి, కరాగారం నుండి అతడు బయట పడేటట్లు చేయడం ద్వారా శ్రీకృష్ణభగవానుడు సూచించాడు. అందువల్ల ఇక్కడ మనం గ్రహించవలసిన తత్త్వం ఏమంటే, మనం పుట్టకుండా ఉండడం కోసం భగవానుడు ఈ లోకంలో పుట్టాడు. మనం ఇక పై మాతృగర్భవాసాన్ని చేయకుండా ఉండడం కోసమే ఆ స్వామి దేవకీగర్భవాసాన్ని స్వీకరించాడు. మనం అతనివలె వైకుంఠంలో నివసించడంకోసం, అతడు ఈ లోకంలోకి వచ్చాడు. మనం ఉన్నత స్థానానికి చేరడం కోసం ఆ స్వామి కిందకు దిగి వచ్చాడు. అంతే కాదు, మనకు కలిగే జన్మ అనేది మనకు సహజంగా ఉండే జ్ఞానాన్ని మరగుపరుస్తుంది. మనం జన్మలను ఎత్తే కొద్దీ మనకు ఉండే జ్ఞానం క్రమక్రమంగా సంకోచిస్తుంది. వివేకాన్ని కోల్పోతాము. కానీ భగవంతుడు అవతారాలను ఎత్తే కొద్దీ ఆయన తేజస్సు మరింత మరింత అభివృద్ధి చెందుతుంది. ఈ విషయమే ఇక్కడ సూచింపబడింది. ఈ తత్త్వాన్ని వేదం కూడా "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (భగవంతుడు ఈ లోకంలో అవతరించినవాడైనప్పుడే శ్రేయస్సును పొందుతున్నాడు) అని అన్నది. వేదం "పితా పుత్రేణ యోనిమాన్ యోనియోనౌ" (అందరికీ తండ్రి అయిన భగవంతుడు ఈ లోకంలో తనకు పుత్రుడైన ఒక జీవుని తనకు తండ్రిగా స్వీకరించి, ఈ లోకంలో అవతారాలను ఎత్తుతున్నాడు) అని చెప్పింది. ఈ అర్థమే ఇక్కడ కూడా తెలియజేయబడింది. వసుదేవుడు ఈ లోకంలో ఉండే ఒక జీవుడు కదా. అతనిని భగవానుడు తనకు తండ్రిగా స్వీకరించి, అతనికి పుత్రుడయ్యాడుకదా. ఈ విషయాన్ని శ్రీరామాయణం కూడా "పితరం రోచయామాస" (భగవంతుడు దశరథుని తనకు తండ్రిగా కోరుకున్నాడు) అని అంటూ తెలియజేసింది.

శ్రీకృష్ణుడు చెప్పిన ప్రకారం వసుదేవుడు శ్రీకృష్ణ బాలకుని తీసుకుని రేపల్లెకు బయలుదేరాడు. బయట వర్షం పడుతున్నది. ఆ శ్రీకృష్ణుడు తడిసిపోకుండా ఉండే టట్లు వసుదేవుని వెంట ఆదిశేషుడు అనుసరిస్తూ, తన పడగలదో గొడుగు వలె ఆవరించి సేవను చేశాడు. ఆ ఆదిశేషుని తలలపై ఉండే రత్నాలు కాంతిని ప్రసాదింప చేశాయి. దిగ్దేవతలు దారిని చూపించాయి. వేదస్వరూపి అయిన గరుత్మంతుడు శ్రీకృష్ణ వసుదేవుల వెంట వేదపారాయణాన్ని చేస్తూ వెళ్ళాడు. భగవంతుడు ఈ లోకంలో అవతరించినప్పుడు అతనితో పాటుగా, ఆ స్వామికి నిత్యకైంకర్యం చేసే నిత్య సూరులు కూడా ఈ లోకంలో వచ్చి, ఆ స్వామిని సేవిస్తారు –అనే విషయం ఇక్కడ తెలియజేయబడింది.

శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు

వసుదేవులకు మార్గంలో యమునానది అడ్డు వచ్చింది అప్పుడు ఆ యమునా అపుడు చాలా వేగంగా ప్రవహిస్తున్నది. నదిలో నీరు నిండుగా ఉన్నది. ఆ నది చాలా లోతుగా ఉన్నది అంతకుమించి బయట వర్షం పడుతున్నది. ఈ సందర్భాన్ని చూసిన వసుదేవుడు "శ్రీకృష్ణా! ఏ విధంగా ఈ నదిని దాటిపోగలను?" అని అన్నాడు. శ్రీకృష్ణుడు అప్పుడు " తండ్రీ! నన్ను నమ్మి నీవు నదిలో దిగి ప్రయాణం చేయి" అని అన్నాడు. వసుదేవుడు శ్రీకృష్ణుని మాటలను నమ్మి యమునానదిలోకి దిగి వెళ్ళసాగాడు. అతని మోకాళ్ళ లోతు నీరు వచ్చింది. నడుము లోతుకు నీరు వచ్చింది. ఆ తరువాత గుండెల ఎత్తుకు నీరు వచ్చింది. ఆ పిమ్మట కంఠం వరకు నీరు వచ్చింది. ఆ తర్వాత శిరస్సు వరకు నీరు వచ్చి అతనిని యమునా నది ముంచివేసింది. అప్పుడు యమునానదీ జలాలు వసుదేవుని తలపై ఉండే శ్రీకృష్ణుని పాదాలను తాకినవి. వెంటనే ఆ నది జలాల లోతు తగ్గిపోవడం ఆరంభించింది. పశుదేవుని మోకాళ్ళ లోతు వరకు వచ్చింది. ఆ నది రెండుగా విడిపోయి వసుదేవునకు మార్గం సుగమం చేసింది. ఈ సందర్భాన్ని వేదాంతదేశికులు అనే ఆచార్యులు యాదవాభ్యుదయం అనే మహాకావ్యంలో చాలా అద్భుతంగా వర్ణించారు" ఘనతర పరిపాక మలీమసైః --సంసృతిమ్" అనే శ్లోకంలో "ఒక జ్ఞాని ఏ విధంగా జన్మను దాటి వెళుతున్నాడో, ఆ విధంగానే వసుదేవుడు యమునా నదిని దాటి వెళ్ళాడు. ఒక యోగి, జన్మ అనే సముద్రాన్ని ఏ విధంగా దాటి వెళ్తాడో, ఆ విధంగా యమునానదిని వసుదేవుడు దాటి వెళ్లాడు" అని అంటూ ఎక్కడ ఒక అద్భుతమైన తత్త్వాన్ని సూచించారు.

మరి మొదటనే యమునానది ఎందుకు దారిని ఇవ్వలేదు? అని అంటే, ఆ యమునా నదికి "శ్రీకృష్ణుని శ్రీచరణాలను తాకాలి, పావనం కావాలి" అనే ఆశ ఉన్నది. ముందుగానే తాను దారి ఇచ్చినట్లయితే, శ్రీకృష్ణుని చరణాలను స్పృశించే అవకాశం ఉండదు కదా. అందువల్ల ఆ నది మొదట శ్రీకృష్ణుని పాదాల ఎత్తుకు వరకు ఎదిగి, ఆ స్వామి పాదాలను తాకి, ఆ పిమ్మట. తగ్గిపోయింది. భగవంతుని శ్రీచరణ సంబంధం వల్ల జన్మ అనే మహాసముద్రమే ఇంకిపోయేటప్పుడు ఈ యమునానది ఇంకిపోదా? దారి ఇవ్వదా. ? దీనివల్ల ఏమి అర్థం అవుతున్నది? అంటే, " నన్ను నమ్ము. సంసార సముద్రం అనేది చాలా లోతయినది అని భయపడకు. ఆ జన్మ సముద్రాన్ని నేను ఇంకింప చేస్తాను" అని భగవంతుడు ఈ సందర్భంగా సూచించాడు. ఈ తత్త్వాన్ని పెరియాళ్వారులు "పిఱవి ఎన్నుమ్ కడలుమ్ వற்றி పెరుమ్ పదమ్ ఆకిన్దదాల్" అనే సూక్తి ద్వారా సూచించారు.

ఈ తత్త్వాన్ని శ్రీ వేంకటేశ్వరుడు కూడా తన స్వరూపంలో సూచిస్తున్నాడు. ఆ స్వామి ఒక చేతితో తన పాదాలను చూపిస్తూ, వేరొక చేతితో తన మోకాళ్ళను పట్టుకొని ఉన్నాడు. ఈ సన్నివేశంలోని తాత్పర్యం ఏమంటే, " నా పాదాలను నీవు నీవు పట్టుకున్నట్లయితే, సంసార మహాసముద్రం మోకాలిలోతు అవుతుంది. సులభంగా నీవు దానిని దాటగలవు"—అని ఇక్కడ తాత్పర్యం. ". నీ తలలో నిండుగా అహంకారమమకారాలు ఉన్నాయి. ది వాటిని తొలగించుకొ"మ్మని అంటూ కేశఖండనాన్ని స్వామి విధించాడు. కేశఖండనంలోని అర్థం కేవలం కేశాలను తొలగించుకోవడం కాదు ఆ నల్లని కేశాలు తలలో ఉండే అహంకార మమకారాలకు సూచకాలు. ద్రావిడ భాషలో వ్యవహరింపబడే "మొట్టతలకు మోకాళ్ళకు సంబంధం" అనే సామెత ఈ రహస్యాన్ని సూచిస్తున్నది. "అహంకారాన్ని తొలగించుకున్న తలతో స్వామి నా పాదాల దగ్గర వాలు. అప్పుడు సంసారమహాసముద్రం మోకాలిబంటిది అవుతుంది" అనే ఈతత్త్వమే యమునానది వసుదేవునకు దారి ఇవ్వడం ద్వారా. తెలియజేయబడింది. ఇన్ని అద్భుతమైన తత్త్వాలు ఈ సందర్భంలో ఇమిడి ఉన్నాయి.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 3

## పూతనామోక్ష వృత్తాంతం

శ్రీకృష్ణుడు రేపల్లెలో నందగోపాలుని ఇంటిలో పెరుగుతున్నాడు. ఈ సంగతిని యోగమాయ కంసునకు తెలియజేసింది. అతడు శ్రీకృష్ణుని అస్తిత్వాన్ని సహించలేక, ఏ విధంగా అయినా శ్రీకృష్ణుని వధించాలి అనే ఉద్దేశ్యంతో పూతన అనే రాక్షస స్త్రీని రేపల్లెకు శ్రీకృష్ణుని వధించమని పంపించాడు. ఆమె "శ్రీకృష్ణుని ఏవిధంగా వహించాలి?" అని ఆలోచించినది. , శ్రీకృష్ణుడు చాలా అందమైన బాలుడు కనుక. అందువల్ల అతనిని దగ్గరకు తీసుకోవాలని అందరూ ఆశపడతారు. తాను కూడా ఒక స్త్రీ రూపాన్ని ధరించి వెళ్లి, శ్రీకృష్ణుని ఎత్తుకొని అతనికి విషం పూసిన తన స్తన్యాన్ని ఇచ్చి వధించాలని అమె భావించింది. నందగోపాలుని ఇంటిలో ప్రవేశించినది. శ్రీకృష్ణుని ఎత్తుకొన్నది. అతనిని దగ్గరకు తీసుకొని పాలను ఇచ్చింది. ఈ సందర్భాన్ని వేదాంతదేశికులు యాదవభ్యుదయ కావ్యంలో " స్తన్యేన కృష్ణః సహ పూతనాయాః ప్రాణాన్ పపౌ లుప్తపునర్భవాయ, తదద్భుతం భావవతాం జనానాం స్తనంధయత్వం న పునర్బభూవ " అని చాలా చమత్కారంగా పలికారు. పూతన శ్రీకృష్ణునకు తన పాలను ఇచ్చింది. ఆమె ఇచ్చిన పాలను శ్రీకృష్ణుడు తాగాడు. అయితే, అతడు కేవలం పాలను మాత్రమే తాగలేదు. ఆమె పాలను, ఆమె మరుజన్మను, ఆమె ప్రాణాన్ని – ఈ మూడిటిని అతడు గ్రహించాడు. కేవలం ఆమె ప్రాణాలను గ్రహించడమే కాదు, ఆమెకు మళ్ళీ జన్మ అనేది లేకుండా చేసి, ముక్తిని అనుగ్రహించాడట. నమ్మాళ్వారులు "ఉడలై ఎన్చిన్ పేయ్ చ్చి మూలైయోడు అవళై ఉయిరుండాన్" అని పూతన ఇచ్చిన పాలతో పాటు ఆమె ప్రాణాలను గ్రహించాడు అని అంటూ ఈ లీలను కీర్తించారు.

ఈ పూతన కథను విన్నవారికి ఏమి ఫలం కలుగుతుందో, దానివి వేదాంతదేశికులు అయిన ఉదాహరించిన శ్లోకంలో తెలియజేశారు. ఈ ఉపాఖ్యానాన్ని ఆలకించినవారికి మళ్లీ జన్మ అనేది కలుగదు అని అన్నారు. శ్రీకృష్ణుడు పూతన దగ్గర పాలను తాగిన వృత్తాంతాన్ని విన్నవారికి మళ్ళీ పుట్టి, తల్లిదగ్గర పాలను తాగే ఆవశ్యకత ఉండదు అని అన్నారు. ఇకపై మళ్ళీ జన్మిస్తే కదా, తల్లి దగ్గర పాలను తాగవలసి ఉంటుంది. ఈ జన్మలో పూతనా మోక్షాన్ని విన్నవారికి ఈ జన్మలోనే తప్పక వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది.

ఈ కథ ద్వారా వ్యక్తం అవుతున్న తత్త్వం ఏమి? అని అంటే, పూతన కేవలం కృష్ణునకు మాత్రమే పాలను ఇవ్వలేదు, మన అందరిలో కూడా ఒక పూతన ఉన్నది. పూతన తన రెండు స్తన్యాలను శ్రీకృష్ణునకు ఇచ్చినట్టుగానే, మనకు కూడా, అజ్ఞానం అనే పూతన, రెండు విధాలైన స్తన్యాలను ఇస్తున్నది. ఇక్కడ పూతన అంటే, మన అజ్ఞానమే. ఆమె మనకు ఇచ్చేటటువంటి రెండు విధాలైన పాలు ఏమంటే, అహంకార మమకారాలే. "నేను నేను "అనే భావన అహంకారం. ఇది అజ్ఞానం వల్లనే కలుగుతుంది. అజ్ఞానం తొలగిపోగానే "నేను నేను" అనే వ్యవహారం కూడా తొలగిపోతుంది. " అడియేన్ " నేను భగవంతుని దాసుడను– అనే వ్యవహారం ఏర్పడుతుంది. జీవుడు భగవంతునకు శేషమై ఉండేవాడు. స్వతంత్రుడు కాదు. అందువల్ల స్వతంత్రమైన భావనను సూచించే ", నేను" అనే వ్యవహారం భగవత్సంబంధం వల్ల సమసి పోతుంది. అజ్ఞానం వల్ల తన స్వరూపాన్ని, భగవంతుని స్వరూపాన్ని గ్రహించలేని జీవుడు దేహాత్మ భ్రాంతిని పొందినవాడై, "నేను "అనే భావనతో ఉంటాడు. అది, అజ్ఞానంతో పోయినప్పుడు లేకుండా పోతుంది. ఇక, "నేను" అనే భావనయే లేకుండా పోయినప్పుడు, " నాది" అనే భావన ఉండనే ఉండదు కదా. మమకారం అంటే, "ఇది నాది, ఈ వస్తువు నాది, ఈ దేహం నాది, ఈ సంపద నాది" అనే భావన. అజ్ఞానం ఆవరించినప్పుడు ఈ లోకంలో ఉండే వస్తువులను చూసి ఇది నాది ఇది నాది అని జీవుడు భావిస్తాడు. ఈ మమకార భావన తొలగిపోవాలి. సమూలంగా అహంకారమకారాలు రెండు తొలగిపోవాలనే ఈ విషయాన్ని నమ్మాళ్వారులు " నీర్ నుమదు ఎన్జివై వేర్ ముదల్ మాయ్ త్తు ఇఱై శేర్ మిన్" (నేను నాది అనే భావనను సమూలంగా పోగొట్టుకొని, భగవంతుని ఆశ్రయించండి) అని అన్నారు. జీవునకు కల అజ్ఞానం అనేది ఒక వైపు అహంకారాన్ని, ఇంకొక వైపు మమకారాన్ని కలిగిస్తుంది. ఈ విషయాన్నే పూతన శ్రీకృష్ణునకు తన రెండు స్తన్యాలతో పాలను ఇవ్వడం సూచిస్తున్నది. ఈ విధంగా అజ్ఞానం అనే ఈ పూతన అహంకార, మకారాలను కలిగించి, జీవుని సంసారంలోనే పడి ఉండేటట్లు చేస్తున్నది. ఈ అహంకారం, మమకారం తొలగాలి అంటే, శ్రీకృష్ణుని పాదాలను ఆశ్రయించాలి. ఆ విధంగా ఆశ్రయించినప్పుడు, ఆ స్వామి, పూతన పాలను తాగి, ఆమె ప్రాణాన్ని హరించినట్లుగా, అజ్ఞానం వల్ల కలిగే మన అహంకార మకారాలను పూర్తిగా లేకుండా చేసి, అజ్ఞానాన్ని కూడా తొలగిస్తాడు. పూతన పాలను పీల్చినట్టుగా అహంకార మమకారాలను పీల్చి వేస్తాడు. పూతన పాలను, ప్రాణాలను, ఆమెకు మరు జన్మను లేకుండా చేసినట్లుగా, మనకు కల

అహంకార మమకారాలను పూర్తిగా తొలగించి, మళ్లీ మనకు జన్మ లేకుండా చేస్తాడు. ఇది పూతన వృత్తాంతంలోని రహస్యం.

ఈ వృత్తాంతంలో ఇంకొక తత్త్వం కూడా ఇమిడి ఉన్నది. "భగవంతునికోసమే ఈ వస్తువును నేను సమర్పిస్తున్నాను" వేరొకనికి కాదు" అనే అనన్యమైన భావనతో ఎవరైనా ఏ వస్తువును సమర్పించినా, భగవానుడు దానిని ఎంతో ప్రీతితో గ్రహిస్తాడు. దీనిని భగవద్గీతలో భగవంతుడే స్వయంగా "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతార్జున! " (పత్రాన్ని అయినా పుష్పాన్ని అయినా ఫలాన్ని అయినా చివరికి తీర్థాన్ని అయినా ఎవడు నాకు భక్తితో సమర్పిస్తాడో భక్తితో కూడుకున్న ఆ వస్తువును నేను చాలా ఆదరంగా స్వీకరిస్తాను) అని అన్నాడు కదా. పోతన శ్రీకృష్ణుని దగ్గరకు పాలను ఇవ్వడం కోసం వచ్చేటప్పుడు, "ఈ పాలను శ్రీకృష్ణులకు మాత్రమే ఇవ్వాలి" అనే అనన్యమైన భావనను కలిగినదై, శ్రీకృష్ణుడునకు ఇచ్చింది. ఆ పాలు విషంతో కూడుకున్నవి అయినప్పటికీ, భగవంతుడు దానిని ఎంతో ఆదరంగా గ్రహించాడు. అంతే కాదు, ఆ విధమైన అనన్యమైన భావనను కలిగిన పూతనకు ముక్తిని కూడా ప్రసాదించాడు. శ్రీవిష్ణుపురాణం ఈ సందర్భాన్ని "స్తన్యం తద్విషసంమిశ్రం రస్యమాసీత్ జగద్గురోః" (జగత్తుకు ప్రభువైన శ్రీకృష్ణునునకు నూతన ఇచ్చినది స్తన్యం విషంతో కూడుకున్నది అయినప్పటికీ, అది ఆ శ్రీకృష్ణునకు చాలా భోగ్యమైనది అయినది) అని అంటూ తెలియజేసింది విషంతో కూడుకున్నది అయినప్పటికీ, పూతన ఇచ్చిన స్తన్యం స్వామికి ఎందుకు భోగ్యమైనది అంటే, అది అనన్యమైన భావనతో ఇవ్వబడినది కనుక. ఈ ఉపాఖ్యానంలో వ్యక్తం అవుతున్న వేరొక తత్త్వం ఇది.

మరి ఒక రహస్యం కూడా ఈ వృత్తాంతంలో ప్రకాశిస్తున్నది. ", భగవంతుని ఎవడు లేకుండా చేయాలని ప్రయత్నం చేస్తాడు, అతడే లేకుండా పోతాడు "అనే తత్వం ఇక్కడ వ్యక్తమవుతున్నది. ఈ విషయాన్ని ఉపనిషత్తు "అసన్నేవ స భవతి ఆసత్ బ్రహ్మేతి వేద చేత్" (భగవంతుడు లేడని అనుకున్నావాడయితే, అతడే లేకుండా పోతాడు) అని తెలిపింది. పూతన శ్రీకృష్ణుని లేకుండా చేయాలనే భావనతో వచ్చింది. చివరకు ఆమెయే లేకుండా పోయిందికదా.

మరి ఒక తత్త్వాన్ని ఇక్కడ గమనిద్దాం. ఒకనికి భగవంతునితో కల సంబంధం ఎటువంటిది అయినా, అది అతనికి తప్పక పరమ పురుషార్థాన్ని ఇస్తుంది. అది

అనుకూలమైన భావనతో కావచ్చు, ప్రతికూలమైన భావనతో కావచ్చు. భగవంతునితో కల సంబంధం వ్యర్థం కాదు. తప్పక ఫలాన్ని ఇస్తుంది. పూతన అటువంటి సంబంధాన్ని శ్రీకృష్ణునితో పొందింది. మానసికంగా ఎల్లప్పుడూ శ్రీకృష్ణుని గూర్చి ఆలోచించినది. ఇది మానసికమైన సంబంధం. ఇక, శ్రీకృష్ణునకు ఆమె పాలను ఇవ్వడం కోసం ఎత్తుకున్నప్పుడు, శ్రీకృష్ణుని చరణాల సంబంధం ఆమె శరీరానికి కలిగింది. ఈ విధంగా మానసికంగా, శారీరకంగా, అన్ని విధాలుగా శ్రీకృష్ణునితో సంబంధాన్ని పూతన పొందినందున దాని ఫలంగానే ఆమె ముక్తిని పొందినది.

మరి ఒక రహస్యాన్ని గమనిద్దాం. భగవంతునితో కల సంబంధం జీవునకు స్వస్వరూపావిర్భావాన్ని కలిగిస్తుంది. "స్వేన రూపణాభినిష్పద్యతే" అని ఈ విషయాన్ని ఉపనిషత్తు కూడా తెలిపింది. పూతన శ్రీకృష్ణుని పాదాల సంబంధాన్ని పొందగానే, ఆమె నిజరూపం వ్యక్తం అయినది. రేపల్లెకు వచ్చినపుడు మారువేషణలో ఒక అందమైన స్త్రీ రూపంలో ఆమె వచ్చింది. కానీ, ఆరోపించుకొన్న ఆ రూపం శ్రీకృష్ణ సంబంధం వల్ల తొలగిపోయి, ఆమె నిజమైన రూపం బయటపడినది.

పూతన మృతశరీరాన్ని రేపల్లెలో గోపాలురు దహనం చేశారు. అప్పుడు ఆమె శరీరం దగ్ధం అవుతుండగా, ఆ శరీరం నుండి సుగంధం వెలువడింది. సామాన్యంగా మృత శరీరం దహనం అయ్యేటప్పుడు, దాని నుండి దుర్గంధం వస్తుంది. పూతన విషయంలో ఆ విధంగా జరుగలేదు. మంచి సుగంధం ఆమె శరీరం నుండి వెలువడింది. దీనికి కారణం, శ్రీకృష్ణుని సంబంధాన్ని ఆమె శరీరం పొందడమే. భగవంతుని సంబంధం వల్ల దోషాలు తొలగిపోయి. రుణాలు ఏర్పడతాయి– అని వేదాంతం చెబుతున్నది. భగవంతుడు అఖిల హేయ ప్రత్యనీకుడు అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. ఇక్కడ భగవంతుని హేయప్రత్యనీకత్వం అంటే, భగవంతుడు కేవలం దోషాలను కలిగి ఉండకపోవడమే కాదు తన సంబంధం ఎవరికీ కలుగుతుందో, వారిలో ఉండే దోషాలను కూడా తొలగించి, వారిని పావనం చేయగలిగిన సామర్థ్యాన్ని కలిగి ఉండడం– అని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. ఆ క్రమంలోనే ఇక్కడ పూతన శరీరం భగవంతుని సంబంధాన్ని పొందినందు వల్ల, దానిలో ఉండే దోషాలు తొలగిపోయి, గుణాలు కలిగాయి.

ఇటువంటి అద్భుతమైన తత్త్వాలు ఇంకా ఎన్నోపూతనా మోక్షవృత్తాంతంలో వ్యక్తం అవుతున్నాయి. విస్తర భీతి చేత చేయలేదు.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 4

శ్రీకృష్ణుడు పూతన పాలతో పాటు, ఆమె ఉసురు కూడా పోయేటట్లు బలంగా పాలను తాగాడు. ఈ విధంగా శ్రీకృష్ణుడు పాలు తాగగానే పూతన బాధను భరించలేక పెద్దగా అరిచింది. ఆమె నరాల సందులు అన్ని చెదిరిపోయాయి. చాలా భయంకరంగా భూమిపై పడింది. అప్పుడు గోకులంలో ఉండే అందరూ నిద్రలో ఉన్నారు. ఈ పూతన చేసిన మహా భయంకరమైన కంఠ ధ్వనిని రేపల్లె గోపాలురు అందరూ విని, నిద్రలేచి పరిగెత్తుకుని వచ్చారు. పూతన చచ్చి భూమిపై పడి ఉన్నది. ఆమె ఒడిలో శ్రీకృష్ణుడు ప్రశాంతంగా ఆడుకుంటున్నాడు. ఈ విషయాన్ని వారు గమనించారు. యశోదా దేవి, నందగోపాలుడు కూడా పరిగెత్తుకొని వచ్చి శ్రీకృష్ణుని ఎత్తుకొని, ఆలింగనం చేసుకొన్నారు.

యశోదా దేవికి మాతృ ప్రేమ పెల్లుబకగా, శ్రీకృష్ణ బాలుని దగ్గరకు తీసుకుని, అతనికి పాలను ఇచ్చింది. పూతన శ్రీకృష్ణునకు పాలను ఇచ్చి, చనిపోయిన దృశ్యాన్ని చూసిన తరువాత కూడా యశోదా దేవి ఏమీ భయపడకుండా శ్రీకృష్ణులకు పాలను ఇచ్చింది కదా ఆమెకు కల వాత్సల్యం ఎంత గొప్పది! అని ఆళ్వార్లు ఆశ్చర్యపడతారు.

శ్రీకృష్ణ బాలనకు రక్షణ కలిగించడం కోసం నందగోపాలుడు, యశోద మంగళాశాసనం చేశారు. "రక్షతు త్వా మశేషాణాం భూతానాం ప్రభవో హరిః, యస్యనాభి సముద్భూతపద్మజాతభవం జగత్" అని ఈ విధంగా వారు శ్రీకృష్ణునకు మంగళాశాసనం చేశారు. జగద్రక్షకుడైన ఆ శ్రీకృష్ణునకే వారిద్దరూ మంగళం పాడారు అంటే, వారి ప్రేమ ఎంత గొప్పదో కదా. భగవంతుని నామానుసంధానం చేసి, వారు మంగళా శాసనం చేశారు. భగవంతుని నామప్రభావాన్ని వర్ణించేటప్పుడు మన పూర్వాచార్యులు "భగవంతుని తిరునామం అతనిని కూడా రక్షించగలిగినది" అని అన్నారు. దానికి ప్రస్తుత సందర్భమే ఒక ఉదాహరణ.

అయోధ్యా నగర జనులు అందరూ శ్రీరామునకు మంగళాశాసనం చేసేటప్పుడు "సర్వాన్ దేవాన్ నమస్యంతి. రామస్యార్థే యశస్వినః (॥ శ్రీరామునకు మంగళం కలగడం కోసం అయోధ్యలో ఉండే ఎనులు అందరూ దేవతాంతరాలను అందరినీ నమస్కరిస్తున్నారు) అనే విధంగా అన్య దేవతల నామాలను పలుకుతూ మంగళాశాసనం చేశారు. కానీ, శ్రీకృష్ణుడు తప్ప వేరు దైవాన్ని తెలియని పరమైకాంతులైన గోకులవాసులు

అయిన గోపాలురు ఆ భగవానుని నామాలనే పురస్కరించుకుని. అతనికి మంగళాశాసనం చేశారు. నిపుణులై ఉండేవారు, ప్రపన్నులై ఉండేవారు ఈ గోపాలుర కృత్యాన్ని అనుసరించాలి— అని అంటారు, మన పెద్దలు.

వేదాంతదేశికులు సారసారం అనే రహస్య గ్రంథంలోని మూలమంత్రాధికారంలో" రక్షతు త్వామ్" అనే పురాణ శ్లోకాన్ని ప్రస్తావించి, నిపుణులై ఉండేవారు "రక్షతు త్వామ్" అనే విధంగా ఆ స్వామినే భగవంతుని పురస్కరించుకొని మంగళాశాసనాన్ని చేస్తారు— అని అంటూ గోపాలుర ఈ కృత్యాన్ని కీర్తిస్తూ పలికారు.

ఇక, శకటాసుర వధ. శ్రీకృష్ణనకు కొంచెం వయస్సు వచ్చింది. ఐదు, ఆరు నెలల బాలుడు అయ్యాడు. పూతనను పంపించి శ్రీకృష్ణుని వధించాలని తాను చేసిన ప్రయత్నం విఫలం కావడాన్ని కంసుడు గమనించాడు. కానీ, తన ప్రయత్నాన్ని మాత్రం మానలేదు. వేరొక అసురుని శ్రీకృష్ణుని వధించమని పంపించాడు. ఆ అసురుడు కూడా రేపల్లెకు వచ్చి తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

ఒకనాడు యశోదాదేవి శ్రీ కృష్ణ బాలునకు పాలను ఇచ్చి, అతనిని ఇంటి బయట ఉండే ఒక బండి నీడలో పరుండ పెట్టింది. కంసుడు పంపిన అసురుడు "ఇదే సమయం", అని భావించి బండిలో ఆవేశించాడు. అతడే శకటాసురుడు. అతడు శ్రీకృష్ణుని పైకి రావడానికి ప్రారంభించాడు. "ఎవడో అసురుడు వచ్చి శ్రీకృష్ణుని వధించాడని ఎవ్వరూ భావించకూడదు. ప్రమాదవశంచేత బండి శ్రీకృష్ణునిపై పడి అతడు చనిపోయాడు అని అందరూ భావించాల"నే ఉద్దేశంతోనే ఆ అసురుడు అటువంటి ప్రయత్నాన్ని చేశాడు. శ్రీకృష్ణుడు ఆ శకటాసురుని ఉద్దేశాన్ని గమనించాడు. చిన్నపిల్లలు పాల కోసం ఏడ్చేటప్పుడు తన చేతులను కాళ్ళను అటు ఇటు ఆడిస్తారు. కృష్ణుడు కూడా పాల కోసం తాను ఏడుస్తున్నట్లుగా లీలను ప్రదర్శిస్తూ, తన చేతులను కాళ్లను కదిలించాడు. ఈ వృత్తాంతాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో "కళ్లచ్చగడమ్ కలక్కழియ కాలోచ్చి" అని అనుసంధించినది. శ్రీకృష్ణుని పాదం, అతని పైకి వస్తున్న బండిరూపంలోని అసురుని తాకింది. వెంటనే ఆ బండి విరిగి ముక్కలు చెక్కలైనది.

భగవంతుని పాదం రక్షించడమే కానీ, ఎవరిని నశింప చేసిన వృత్తాంతం లేదు. మరి ఇప్పుడు శ్రీకృష్ణస్వామి పాదం శకటాసురుని ఏవిధంగా నశింప చేసింది? తన

స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తించదు కదా. శ్రీ రాముడు తన చేతితో తాటకను వధించినప్పటికీ, తన పాదంతో అహల్యను రక్షించాడు కదా. ఈ శ్రీకృష్ణుని పాదం శకటాసురుని తాకింది. తాకగానే, ఆ శ్రీచరణ ప్రభావం చేత ఆ శకటాసురుడు నశించలేదు అతని శరీరం శుద్ధసత్త్వమయమై, మోక్షాన్ని పొందాడు. అందువల్ల భగవంతుని పాదం రక్షిస్తుంది కానీ, ఎవరిని నశింప చేయదు.

భగవంతుని పాదం ఎంత గొప్పది అంటే, అది ఇతరులను రక్షించడం మాత్రమే కాదు చివరకు ఆ స్వామిని కూడా ఆపదలో రక్షించే శక్తిని కలిగినది అని అంటారు. " శగడ అశురర్ ఉడల్ వేఱా పిళందు వీయ తిరుక్కాలాండ పెరుమానే! " (నీ శ్రీపాదాలతో శకటాసురుని శరీరం భగ్నమై కింద పడేటట్లుగా చేసి, రక్షించిన స్వామీ! ) అనే సూక్తిలో నమ్మాళ్వార్లు ఈ సత్యాన్ని తెలియజేశారు. ఇక్కడ "తిరుక్కాలాండ" (శ్రీ చరణాలతో రక్షించిన) అనే ప్రయోగం చాలా విలక్షణమైనది. దీనికి పలు విధాలుగా ఉండే అర్థాలను మన పూర్వాచార్యులు చాలా అందంగా వివరించారు. భగవంతుడు పాదాలతో పాలించడం ఎవరిని? అని అంటే, తన శ్రీపాదంతో తనకు కలిగిన ఆపదనే తొలగించుకున్నాడు. భగవానుడైన శ్రీకృష్ణుడు. తన పాదాలతో తాకి కదా శకటాసురుని భగ్నం చేశాడు. ఇంకొక అర్థం ఏమంటే, తన పాదాలతో ఆ శకటాసురుని తాకి బండి రూపంలో ఉండే అతని శరీరాన్ని భగ్నంచేశాడు అని. ఇక్కడ శకటం అంటే, మన శరీరమే. బండి అనేది ఒక చోట నుండి ఇంకొక చోటుకు వెళ్లడానికి ఉపయోగించే గమన సాధనం. అనేక కార్యాలను నిర్వహించడానికి పనికి వచ్చే సాధనం. భగవంతుడు మనకు ఇచ్చిన ఈ శరీరం కూడా అటువంటి సాధనమే కదా. తాను ఉపదేశించిన ధర్మాలను అనుస రించి మంచి కృత్యాలను చేయడం కోసం, ఆ భగవంతుని ఆరాధించడం కోసంగా కదా ఈ శరీరాన్ని ఇచ్చాడు. భగవంతుని శ్రీపాద సంబందం చేత ఈ పాచభూతికమైన శరీరం తొలగిపోయి, ముక్తి లభిస్తుంది అనే తత్త్వం కూడా ఇక్కడ వ్యక్తమవుతున్నది. ఇక, మూడవ అర్థం ఏమంటే, సర్వశక్తి అయిన భగవంతునకు ఎవ్వరూ ఆపదలను కలిగించలేరు. అందువల్ల భగవంతునకు తనను తాను రక్షించుకునే ఆవశ్యకత లేకపోయినప్పటికీ, ఆ శ్రీకృష్ణ భగవానుని ప్రాణంగా భావించే పరమైకాంతులైన గోపికల రక్షణ కోసం భగవానుడు తన పాదంతో శకటాసురుని భగ్నం చేశాడు. అంతే కాదు. రాబోయే కాలంలో ఆళ్వారులవంటి మహనీయులు శ్రీకృష్ణ బాలుని పైకి బండి వచ్చిన వృత్తాంతాన్ని విన్నప్పుడు, ఆ స్వామి పై అంతులేని ప్రేమను కలిగిన వారికి ఎంతో భీతి కలుగుతుంది కదా. అటువంటి వారి భయాన్ని తీర్చడం కోసం తన

పాదంతో శకటాసురుని శరీరాన్ని ముక్కలు చేశాడు– అని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానిస్తారు. "జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్" –జ్ఞాని అయినవాడు ఆత్మయే అని నా అభిప్రాయం– అని భగవానుడు గీతలో అన్నాడు. అందువల్ల. గోపికలవంటి, గోపాలురవంటి, ఆళ్వార్లవంటి పరమైకాంతులను రక్షించడం ద్వారా భగవంతుడు తనను తాను రక్షించుకున్నట్లు అయినది కదా. ఇటువంటి రస్యమైన తత్త్వాలు ఈ శకటాసుర వృత్తాంతంలో వ్యక్తమవుతున్నాయి.

భక్తుడు భగవంతుని శరణాగతి చేసేటప్పుడు "చరణౌ శరణం ప్రపద్యే" అని పాదాలను పట్టుకుని శరణాగతి చేస్తాడు. అంతే తప్ప, చేతులను పట్టుకొని శరణాగతి చేయడు కదా. భగవంతుని తిరుమేనిని ఆశ్రయించడు. తిరువడినే ఆశ్రయిస్తాడు. అందువల్ల భగవంతుని పాదం రక్షిస్తుంది తప్ప శిక్షించదు, భయాన్ని కలిగించదు.

అసురుడు శకటరూపంలో వచ్చాడు. బండికి చక్రం ఉంటుంది కదా. ఈ శకటాసురుని రూపంలో ఉండే చక్రం ఏమంటే, జీవుని జన్మ మరణచక్రమే. చక్రం అనేది మాటిమాటికి కిందకు పైకి తిరుగుతూ ఉంటుంది. ఆ విధంగానే ఈ జీవుడు ఈ సంసారంలో పుడుతూ చనిపోతూ ఈ జన్మ మరణ చక్రంలో చిక్కుకొని ఉంటాడు. "మాటి మాటి పల పిఱప్పుమ్ పిఱందు"అని అన్నారు, అళ్వార్లు కూడా. శ్రీకృష్ణుని శ్రీపాదం తగలగానే శకటంలోని చక్రం భిన్నమైనది. అంటే, భగవంతుని పాద సంబంధం ఏర్పడితే, ఈ జన్మ మరణ చక్రం అనేది నశించిపోతుంది–అనే తత్త్వం ఇక్కడ సువ్యక్తం అయినది.



# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 5

ఇప్పుడు, శ్రీకృష్ణభగవానుడు తనను వధించాలని వచ్చిన అసురులకు అందరికి ముక్తిని ప్రసాదించడంలోని వేదాంతతత్త్వం ఏమో గమనిద్దాం.

శకటాసురునే కాకుండా శ్రీ కృష్ణుడు పలువురు అసురులను సంహరించాడు. అఘాసురుడు, బకాసురుడు, వత్సాసురుడు కవిత్థాసురుడు, ప్రలంబాసురుడు, ధేనుకాసురుడు, అరిష్టాసురుడు – ఈ విధంగా పలువురు అసురులు శ్రీకృష్ణుని వధించాలని వచ్చి ముగిసిపోయారు. ఈ అసురులు అందరూ శ్రీకృష్ణునిచే వధింపబడ్డారు. వీరందరూ ముక్తిని పొందారు. వీరు అసురులు కదా! వీరికి భగవానుడు ముక్తిని అనుగ్రహించవచ్చునా. వీరంతా శ్రీకృష్ణుని వదిలించాలని కదా వచ్చారు. ప్రబోధ సుధాకరం అనే గ్రంథంలో ఈ విషయాన్ని గూర్చి ప్రస్తావించి శంకరాచార్యులవారు ఒక విషయాన్ని తెలియజేశారు. ఒక విలక్షణమైన శిల ఉన్నది. ఆశిల ఎటువంటిది? అంటే, ఆ శిల ఏ లోహానికి తాకించబడుతుందో, ఆ లోహం బంగారంగా మారుతుంది. ఒకడు ఆ శిలను పగులగొట్టాలని తలచి ఇనుప కమ్మీతో ఆ రాయిని కొట్టాడు. అప్పుడు ఆ రాయి పగుల లేదు కానీ, ఆ రాయిని కొట్టిన ఆ ఇనుపకమ్మీ బంగారంగా మారిపోయింది. అటువంటి శిలవంటివాడే శ్రీ కృష్ణ భగవానుడు. తన సంబంధాన్ని ఎవరు పొందినప్పటికీ, ఏ విధంగా పొందినప్పటికీ కూడా, వారికి ఉత్తమ గతిని ప్రసాదిస్తాడు. శ్రీకృష్ణుని వధించాలని వచ్చిన అందరూ ఉత్తమ పొందడం ఎటువంటిది?, అంటే, శిలను పగులగొట్టడానికి ఉపయోగించిన ఇనుప కమ్మి బంగారంగా మారడంవంటిది. రాయి పగుల లేదు, కాని, ఆ రాయిని తాకిన ఇనుప కమ్మి బంగారంగా మారినది, ఆ విధంగానే శ్రీకృష్ణుని వధించాలని అసురులు పలువురు వచ్చినప్పటికీ, శ్రీకృష్ణుడు చనిపోలేదు, ఆ శ్రీకృష్ణుని సంబంధాన్ని పొందిన అందరూ ముక్తులయ్యారు. దీనివల్ల ఇక్కడ ఏమి తెలుస్తున్నది ? అని అంటే, భగవంతుడు తనను భక్తితో ఆరాధించినవారికి మోక్షాన్ని ప్రసాదించడం మాత్రమే కాదు తనను ద్వేషంతో దరి చేరినవారికని కూడా, అంటే, వైరభక్తితో దరిచేరినవారిని కూడా వదిలిపెట్టడు. వారికి ముక్తిని ప్రసాదిస్తాడు– అని తెలుస్తున్నది. తనను ద్వేషించి దూషించిన శిశుపాలునకు కూడా ముక్తిని ప్రసాదించాడు– అని "పఴుమ్ పగైవన్ శిశుపాలన్ తిరువడియాల్ పాలడైంద తన్మై" (చిరకాల ద్వేషంతో తన దగ్గరకు చేరిన శిశుపాలునకు కూడా తన శ్రీచరణ సన్నిధిని అనుగ్రహించిన స్వభావం) అని అన్నారు. కదా, ఆళ్వార్లు.

అంటే, ఇక్కడ భగవంతుని విషయంలో వైరంతో ప్రవర్తించాలని ఇక్కడ తాత్పర్యం కాదు. వైరంతో దరి చేరినవారిని కూడా భగవానుడు అనుగ్రహిస్తున్నాడంటే, ఇక, ప్రేమతో సమీపించినవారి విషయంగూర్చి చెప్పవలసి ఉన్నదా? అనే కైముతిక న్యాయాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి. అందుచేత భగవంతునితో సంబంధాన్ని ఏ రీతిలో పొందినా, అది విఫలం కాదు, తప్పక ఫలాన్ని ఇస్తుంది– అనే ఒక విశిష్టమైనతత్త్వం ఇక్కడ తెలియజేయబడింది.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 6

శ్రీకృష్ణుడు బాలుడుగా రేపల్లెలో రహస్యంగా పెరిగే కాలంలో, ఆ స్వామిని చంపడం కోసం కంసుడు చాలామంది అసురులను పంపించాడు. వారిని అందరిని శ్రీకృష్ణుడు వధించాడు. శ్రీకృష్ణచరిత్రను తెలిపే శ్రీవిష్ణుపురాణంలో అసురులను అందరినీ శ్రీకృష్ణ బాలుడు వధించిన వృత్తాంతాలు ప్రస్తావింపబడలేదు కొన్ని మాత్రమే ప్రస్తావించబడ్డాయి. కానీ, భాగవతంలో విశదంగా ఈ లీలలు చాలా వర్ణింపబడ్డాయి. వాటిలో, ఇప్పుడు, తృణావర్త నిరాకరణకథను, అందులోని రహస్యాన్ని గమనిద్దాం.

ఒకనాడు యశోదాదేవి తన ఒడిలో శ్రీకృష్ణబాలుని కూర్చోపెట్టుకొని, ముద్దులాడుతున్నది. ఉన్నట్లుండి శ్రీకృష్ణుడు క్రమక్రమంగా చాలా బరువు అయ్యాడు. దానికి కారణమేమో తెలియని యశోదా దేవి ఆశ్చర్యపడి, అతని బరువును మోయలేక, అతనిని కింద కూర్చుండబెట్టింది. అప్పటికే కంసుడు పంపించిన ఒక తృణావర్తుడు అనే పేరు కల రాక్షసుడు శ్రీకృష్ణుని చంపడానికి అనువైన అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు. యశోదాదేవి తన ఒడిలో నుండి శ్రీకృష్ణుని కింద కూర్చోబెట్టగానే, ఆ అసురుడు సుడిగాలి రూపంలో వచ్చాడు. రేపల్లెలో అంతటా దుమ్ము ఆవరించేటట్లు చేసి, అంతా చీకటిని చేశాడు. శ్రీకృష్ణుని ఆకాశంలోకి వేగంగా తీసుకొని పోయాడు. ఆ సుడిగాలి వేగంవల్ల, అంతటా దుమ్మురేగి చీకటి ఆవరించినందువల్ల శ్రీకృష్ణుని చూడలేని యశోదాదేవి అతడు ఏమైనాడో తెలుసుకో లేకపోయింది.

శ్రీకృష్ణుని తీసికొని ఆకాశంలోకి వెళ్లిన తృణావర్తుడు, క్రమక్రమంగా బరువు అధికం అవుతున్న శ్రీకృష్ణుని, మోయలేకపోయాడు. అతని బరువును భరించలేకపోయాడు. బాలకృష్ణుడు తృణావర్తుని కంఠాన్ని తన చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. శ్రీకృష్ణుని చేతుల పట్టునుండి బయటపడడంకోసం ఆ అసురుడు ఎంత పెనుగులాడినా అతనికి సాధ్యం కాలేదు. పైగా శ్రీకృష్ణుని బరువు మరింత అధికం అయినది. దానితో ఆ అసురుడు బాధను భరించలేక, గట్టిగా కేకలు పెడుతూ, రేపల్లెలోని ఒక రాతిపై శ్రీకృష్ణునితో పాటు పడిపోయాడ. అతని అవయవాలు అన్నీ చూర్ణం అయ్యాయి. అతడు ప్రాణాలను వదిలి పెట్టాడు. శ్రీకృష్ణ బాలునకు మాత్రం ఎటువంటి ఆపద కలగలేదు ఎటువంటి అపాయం లేకుండా కిందకు వచ్చిన శ్రీకృష్ణుని చూచి, ఆ స్వామి విషయంలో

ప్రీతిని కలిగిన యశోద, నందగోపాలుడు, రేపల్లెలోని గోగోపీజనం అంతా ఆశ్చర్యంతో పాటు ఆనందాన్ని పొందారు.

ఈ వృత్తాంతంలో వ్యక్తమవుతున్న వేదాంతతత్త్వాలను గమనిద్దాం. జీవునిలో అహంకార మమకారాలు అధికమైనప్పుడు, ఈ లోకంలో ఉండే వస్తువులు అన్నీ భగవంతునకు చెందినప్పటికీ, వాటిని తనవిగా భావించి, వాటిని పొందాలనే ఆశను పొందుతాడు. అవి భగవంతుని సొత్తు అని అతడు తెలియలేదు. అప్పుడు అతనికి లౌకికమైన విషయాలపై తృష్ణ కలుగుతుంది. ఈ తృష్ణయే ఒక సుడిగాలి. సుడిగాలి తనలో పడిన గడ్డిపోచను ఏ విధంగా వేగంగా పైపైకి తీసుకొని పోతుందో, ఆ విధంగానే తగని ఆశ అనేది జీవుని మనసు భ్రమించేటట్లు చేస్తుంది. తృణావర్తుడు సుడిగాలి రూపంలో వేగంగా వచ్చినప్పుడు రేపల్లెలో అంతట దుమ్ము ఆవరించింది. దానివల్ల అంతటా చీకటి అయిపోయినది. ఇటువంటి స్థితిలో రేపల్లెలో ఉండేవారు ఏమీ చూడలేకపోయారు. ఈ విధంగానే, జీవుని మనసులో ఆశ అధికమయ్యే కొద్దీ, అతనిలో ఉండే వివేకజ్ఞానం నశిస్తుంది. ఏమి గమనించలేరు. మంచి చెడ్డలు తెలియవు. తమో గుణం పూర్తిగా అతనిని మనసును ఆవరిస్తుంది. ఆత్మ పరమాత్మల వివేకజ్ఞానం అతనికి కలుగదు.

శ్రీకృష్ణుడు తృణావర్తుని వధించి, తనను ప్రాణంగా అభిమానించే యశోదానందుల రేపల్లెలోని గోగోపీజనాల ఆర్తిని చూసి, మళ్లీ తాను వారికి లభించేటట్లుగా చేశాడు. ఆ విధంగానే, జీవుడు తనలో ఉండే లౌకికమైన ఆశను భగవంతునిపై భక్తిని పెంపొందించుకోవడంద్వారా పోగొట్టుకోవాలి. మనసులో లౌకికమైన ఆశ ఎక్కువ అయ్యే కొద్దీ, భగవంతుడు దూరం అవుతాడు. భగవంతునిపై భక్తి పెరిగినట్లయితే, అతడు దగ్గర అవుతాడు. గడ్డిపోచను సుడిగాలి దూరంగా తీసుకొని పోయినట్టే, జీవుని మనసు అనే తృణాన్ని సుడిగాలి అనే లౌకిక విషయాలలోని తృష్ణ దూరంగా తీసుకుని పోతుంది. భగవంతునిపై భక్తిని, ప్రీతిని పెంపొందించుకోవడం ద్వారా లౌకికతృష్ణను నశింప చేసుకోవచ్చు– అనే తత్త్వమే తృణావర్త నిరసనవృత్తాంతంలో వ్యక్తమవుతున్నది– అని పెద్దల అభిప్రాయం.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 7

(బాలకృష్ణుడు రేపల్లెలో గోపికలచేత దెబ్బలు తినడం –సర్వాంతర్యామిత్వమ్)

బలరామ శ్రీకృష్ణులు ఇద్దరు రేపల్లెలో పెరుగుతున్నారు. ఇద్దరు గోకులంలో అంతటా ఆడుకుంటున్నారు. ఒంటికి దుమ్మును పట్టించుకొని, అటు ఇటు తిరుగుతూ అంతటా సంచరిస్తున్నారు. గోవులను కట్టే శాలలోకి వెళ్లి అక్కడ గోవుల బంధాలను విడదీసి వాటిని బయటికి వదిలి పెడుతున్నారు. ఎన్నో అల్లరి పనులను చేస్తున్నారు ఎవరైనా అక్కడకు వెళ్లి వారిని పట్టుకోవాలని ప్రయత్నం చేస్తే, వెంటనే చేతికి దొరకకుండ, కంటికి కనబడకుండా పారిపోతున్నారు. గోవులు, లేగదూడలు మొదలైనవాని తోకలను పట్టుకొని లాగి వాటిని బాస్తున్నారు. ఈ విధంగా అందరి పనులను చేస్తూ ఆడే ఈ బలరామకృష్ణులను అడ్డుకోవడానికి యశోదకు శక్తి చాలలేదు. తిట్టడానికి నోరు రాలేదు, కొట్టడానికి చేయి రాలేదు.

రేపల్లెలో ఉండేవారంతా ఈ బాలురు ఇద్దరూ చేసే ఒంటరి పనులను సహించలేకపోయేవారు. యశోద ఊరుకున్నా వారు సహించలేరు కదా. ఒకనాడు ఒక గోపిక తన ఇంటిలోకి వచ్చి అల్లరి పనులను చేసే శ్రీకృష్ణుని చూసి, తన ఇంటిలో అతడు వెన్నను, పాలను దొంగిలించి తినడాన్ని గమనించి, " మా ఇంటిలో వెన్నను పాలను తిని అల్లరి చేస్తావా? ఉండు, నీ పని చెప్తాను" అని బెత్తంతో అతనిని కోపంతో కొట్టింది. అప్పుడు శ్రీకృష్ణనకు ఏమీ కాలేదు, కానీ, 14 లోకాలలోనివారికి అందరికీ ఆ దెబ్బలు తగిలాయి–అని అంటారు అష్ట ప్రబంధంలో శ్రీపిళ్ళై ప్పెరుమాళ్ అయ్యంగార్. అనే తమిళ కవి. పాతాళలోకం నుండి సత్యలోకం వరకు ఉండే అన్ని లోకాలలోని అందరికీ ఆ దెబ్బలు తగిలాయట. శ్రీకృష్ణుడు రేపల్లెలో దెబ్బలు తిన్న వృత్తాంతాన్ని ఆళ్వార్లు కూడా విశేషంగా అనుభవించారు. నమ్మాళ్వార్లు, తిరుమంగై ఆళ్వారులు మొదలైన పలువురు దివ్య సూరులం ఈ లీలను పరవశంతో అనుభవించారు. "వెణ్ణెయ్ ఈండు, ఆప్పుండ" (పెరియ తిరుమొళి– 8 –2 –5) , " ఆయ్ చ్చియరాల్ అళై వెణ్ణెయ్ ఉండు ఆప్పుండు ఇరుందానై" (పెరియతిరుమొళి– 10–6–1) మొదలైన సూక్తులలో ఈ అనుభవాన్ని గమనించవచ్చు.

## శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు

ఈ వృత్తాంతంలో శ్రీకృష్ణపరమాత్మ వ్యక్తం చేసిన ఒక అద్భుతమైన వేదాంత తత్త్వాన్ని గమనిద్దాం. వేదంలో అంతర్యామి బ్రాహ్మణం అనే ఒక భాగం ఉన్నది. అందులో యాజ్ఞవల్క్యముని భగవంతుని సర్వాంతర్యామిత్వాన్ని గూర్చి తెలియజేస్తూ "యస్య పృథివీ శరీరమ్" ఇత్యాదిగా పలికి, ఈ పృథివి అంతా భగవంతుని శరీరమై ఉన్నది. ఈ పృథివిలో భగవానుడు అంతర్యామియై ఉన్నాడు. కానీ, ఆ విధంగా భగవంతుడు తనలో అంతర్యామిగా ఉన్నట్లు ఆ పృథివికి తెలియదు. ఆ భగవంతుడే ఈ పృథివిలో అంతర్యామిగా లేకపోతే అది నిలువలేదు. దానికి అస్తిత్వమే ఉండదు–అని అన్నారు. కేవలం పృథివిలోనే కాదు, తేజస్సులో కూడా ఈ విధంగా అంతర్యామిగా ఉన్నాడు. అగ్నిని తనకు శరీరంగా కలిగి ఉన్నాడు. కానీ, అగ్నికి భగవంతుడు అంతర్యామిగా తనలో ఉన్నట్లు తెలియదు ఆ విధంగానే నీటిలో, వాయువులో, ఆకాశంలో, ఈ లోకంలోని అన్ని పదార్థాలలో భగవానుడు అంతర్యామిగా ఉన్నాడు. ఇంతే కాదు, భగవంతుడు ఆత్మను కూడా తనకు శరీరంగా కలిగి ఉన్నాడని అంతర్యామి బ్రాహ్మణం తెలుపుతున్నది "యస్య ఆత్మా శరీరమ్, య ఆత్మని తిష్ఠన్, ఆత్మనోంతరః, యమాత్మా న వేద, యమాత్మానమంతరో యమయతి, ఏష త ఆత్మా అంతర్యామ్యమృతః" అనేది బృహధారణ్య కోపనిషత్తులోని అంతర్యామి బ్రాహ్మణంలో ఉండే వాక్యం. ఈ వాక్యం ఏమి చెబుతున్నది? అంటే, భగవంతుడు లోకంలో ఉండే అందరూ జీవులందరిలో అంతర్యామిగా నిలచి ఉండి వారిని తనకు శరీరంగా కలిగి ఉన్నాడు. కానీ, ఆ ఆత్మకు తనలో భగవానుడు అంతర్యామిగా ఉన్నాడనే సంగతి తెలియదు. ఆ పరమాత్మ లేకపోతే, ఆ ఆత్మ నిలువ లేదు. అటువంటివాడు ఆ భగవానుడు– అని తెలుపుతున్నది.

ఈ విధంగా భగవానుడు అందరిలోనూ అంతరాత్మగా ఉన్న కారణం చేతనే గోపిక శ్రీకృష్ణుని కొట్టినప్పుడు, ఆ దెబ్బలు అతనికి తగుల లేదు, కానీ, అవి లోకంలో ఉండే అందరికీ తగిలాయి. దానికి కారణం ఏమి? అంటే, ఈ లోకం అంతా భగవంతుని శరీరమై ఉండడమే. ఆత్మలన్నీ ఆ భగవంతునకు శరీరమై ఉండడమే. గోపిక శ్రీకృష్ణుని కొట్టినప్పుడు, 14 లోకాలలో ఎంతమంది ఉన్నారో, అంతమందికి ఆ దెబ్బలు తగిలాయట.

ఈ విధంగా శ్రీకృష్ణ భగవానుడు తనను గోపిక కొట్టినప్పుడు తగిలిన దెబ్బలు తనకు కాకుండా లోకంలో ఉండే అందరికీ తగిలేటట్లుగా చేసి, తన అంతర్యామిత్వాన్ని తెలియజేశాడు ఆ లీలతో పండిత పామరుల మనసులను ఆకర్షించాడు. ఈ విషయాన్ని

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు

భగవద్రామానుజులు గీతాభాష్యావతారికలో– తన లీలలతో భగవానుడు పండితుల మనసులను ఆపహరించడమేకాక, పామరుల మనసులను కూడా ఆకర్షించడం కోసం తన లీలలను ప్రదర్శించాడు– అని అన్నారు. బాలకృష్ణుని గోపిక కొట్టినప్పుడు లోకంలో అందరికి అవి తగిలాయి. అప్పుడు పామరులు ఇదేమి చిత్రమని ఆశ్చర్యపడ్డారు. పండితులు ఈ సందర్భాన్ని గమనించి, ఇందులో ఉండే తత్త్వార్థాన్ని, అంటే, భగవంతుడు అందరికీ అంతర్యామిగా ఉన్నందువల్లనే అతనిని గోపిక కొట్టినప్పుడు లోకంలో అందరికీ ఆ దెబ్బలు తగిలడం– అనే ఈ లీలలో అని రహస్యాన్ని గ్రహిస్తారు.

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలోని ఉళ్ళృత్తు క్కొండు మునివర్ గళుమ్ యోగిగళుమ్" అనే ప్రయోగాన్ని వ్యాఖ్యానం చేస్తూ రేపల్లెలో యోగులు, మునులు ఉండే అవకాశం ఏమున్నది? అని ప్రశ్నించుకొని, తన అద్భుతమైన దివ్యలీలలతో ఎన్నో వేదాంత తత్త్వాలను ప్రదర్శించే శ్రీకృష్ణభగవానుని దర్శించడం కోసమే రేపల్లెలో ఉండే గోవుల కొట్టాలలో యోగులు, మునులు అందరూ గుమిగూడి ఉంటారు, ఆ వాస్తవాన్ని గ్రహించి గోదాదేవి ఈ విధంగా అన్నది అని మన పూర్వాచార్యులు అందంగా వ్యాఖ్యానిస్తారు.

ఈ విధంగా ఈ లీలద్వారా శ్రీకృష్ణభగవానుడు తన సర్వాంతర్యామిత్వాన్ని ప్రదర్శించాడు.



# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 8

## శ్రీకృష్ణుడు మన్నును తినడం– భగవంతుని బహిర్వ్యాప్తి

ఇంతకుముందు ప్రస్తావించిన శ్రీకృష్ణలీల భగవంతుని అంతర్యామిత్వాన్ని, అంటే, ప్రతి వస్తువు లోపల వ్యాపించి ఉండి, నియమించే స్వభావాన్ని తెలియజేస్తున్నదని చూశాము. ఇప్పుడు, భగవంతుని బహిర్వ్యాప్తిని తెలియజేసే ఇంకొక శ్రీకృష్ణలీలను దర్శిద్దాం. ఈ లీల ఏమంటే, శ్రీకృష్ణుడు మన్నును తిన్న వృత్తాంతం. ఈ కథ శ్రీవిష్ణుపురాణంలో ప్రస్తావించబడకపోయినా, శ్రీభాగవతంలో చాలా అందంగా వర్ణింపబడింది.

వేదాంతాలు, పరమాత్మ జగత్తుకు లోపల ఉండే అన్ని వస్తువులలోను వ్యాపించి ఉండడమే కాక, బయట కూడా వ్యాపించి ఉన్నాడు– అని తెలియజేస్తున్నది. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (లోపల బయట కూడా నారాయణుడు అంతటా వ్యాపించి ఉన్నాడు) అని మొదలైన వాక్యాలు ఈ తత్త్వాన్ని తెలుపుతున్నాయి. పరమాత్మ సూక్ష్మరూపంలో లోపల అంతర్యామియై ఉండగా బృహద్రూపంలో బయట వ్యాపించి ఉన్నా ఉన్నాడు. ఒకే వస్తువు చిన్నదిగాను, పెద్దదిగాను ఉండడం లోకవిలక్షణం. లోపల వ్యాపించినది, బయట వ్యాపించలేదు, బయట వ్యాపించినది లోపల వ్యాపించలేదు. లోకస్థితి ఈ విధంగా ఉండగా, భగవంతుడు మాత్రం విశ్వం లోపల, బయట వ్యాపించి ఉండడం అనేది ఆ పరమాత్మకు గల అసాధారణమైన శక్తిని తెలుపుతున్నది.

భగవంతుడు బృహద్రూపంతో బయట వ్యాపించి ఉన్నాడు. అంటే, అతడు మనలను ధరిస్తున్నాడు– అని అర్థం ఆ స్వామి లోపలనే మనమందరము ఉన్నాము. ఈ జగత్తు అంతా అతనిలోనే ఉన్నది. సమస్తం ఆయనలోనే నిలచి ఉన్నది. ఇక్కడ ఆశ్చర్యం ఏమంటే, భగవానుడు మన అందరి లోపల ఉండడమే కాక, అతడే బృహద్రూపంతో మనకు బయట కూడా వ్యాపించి ఉన్నాడు. తాను విశ్వంలో అంతక బయట వ్యాపించి ఉండే విషయాన్ని శ్రీకృష్ణ భగవానుడు తాను మన్నును భక్షించిన వృత్తాంతం ద్వారా తెలియజేశాడు.

ఇక్కడ ఒక అద్భుతమైన విషయం. లోకంలో చిన్నపిల్లలకు మట్టిని తినే అలవాటు ఉంటుంది, తల్లులు ఆ అలవాటును, వారికి వెన్న మొదలైన మధురమైన భోగ్య పదార్థాలను

తినిపించడం ద్వారా మాన్పించడానికి ప్రయత్నం చేస్తారు. భగవానుడు శ్రీకృష్ణుడై అవతరించి, అతిమానుషమైన లీలలను ఒకవైపు ప్రదర్శిస్తూనే, మరొకవైపు లోకసాధారణమైన, లోకంలో ఉండే బాలురు చేసే పనులను కూడా చేశాడు. ఇది భగవానుని అవతార సత్యత్వాన్ని తెలుపుతున్నది. తాను బాలుడై పుట్టినందున, ఉన్నందున లోకంలో ఉండే బాలురు చేసే పనులను అన్నిటినీ చేసినప్పుడే, ఆ అవతార సత్యత్వం సిద్ధిస్తుంది. భగవానుడు వరాహావతారాన్ని ఎత్తినప్పుడు, ఆ స్వామి వరాహరూపాన్ని చూసిన మిగిలిన వరాహాలు " ఈ వరాహం మన జాతికి చెందినది కాదు. వేరొక చోట నుండి ఎక్కడ నుంచో వచ్చినది" అని గుర్తించలేకపోయాయట. ఆ విధంగానే, ఇక్కడ శ్రీకృష్ణభగవానుడు కూడా మన్నును తినడం ద్వారా తన అవతార సత్యత్వాన్ని ప్రదర్శించాడు.

శ్రీకృష్ణుడు మన్నను తినడాన్ని చూసిన బలరాముడు ఆ విషయాన్ని తల్లి యశోదా దేవి దగ్గరకు వచ్చి చెప్పాడు. యశోద వెంటనే శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చి, "కృష్ణా! మట్టి తింటున్నావా?" అని అన్నది. "లేదమ్మా, లేదు. అన్నయ్య అసత్యం చెబుతున్నాడు, "నాహం భక్షితవానంబ! సర్వే మిథ్యా వదంతి "అని శ్రీకృష్ణుడు అన్నాడు. "ఏదీ! నీ నోరు తెరువు" చూస్తాను అని అన్నది యశోద. వెంటనే శ్రీకృష్ణుడు తన నోటిని తెరచి చూపించాడు. యశోదకు శ్రీకృష్ణుని నోటిలో సమస్త బ్రహ్మాండం కనిపించింది.

ఈ లీలను పెరియాళ్వార్లు కూడా ప్రస్తావించారు. కానీ, వేరొక సందర్భంలో ఈ లీలను శ్రీకృష్ణుడు ప్రదర్శించినట్లు వారు వర్ణించారు. ఈ లీలను శ్రీకృష్ణుడు తన శైశవ దశలోనే వ్యక్తం చేసినట్లు వారి సూక్తులలో తెలుస్తున్నది. "కైయుమ్ కాలుమ్ నిమిర్ త్తు –– వైయ మేఱ్ఱుమ్ కండాళ్ పిళ్ళైవాయుళే", అనే పాశురంలో వారు ఈ లీలను స్తుతించారు. శ్రీకృష్ణుడు చాలా చిన్నతనంలో ఉండగా, యశోదా దేవి అతనికి స్నానం చేయిస్తున్నది. ఆ ప్రయత్నంలో ఆమె శ్రీకృష్ణ బాలుని నోరును తెరచి శుభ్రం చేయటానికి ప్రయత్నించింది. అప్పుడు శ్రీకృష్ణుని నోటిలో ఆమెకు అన్నిలోకాలు గోచరించినవి– అని పెరియాళ్వారుల సూక్తి తెలుపుతున్నది.

ఈ లీలనుగూర్చి శుకమహర్షి ఒక విధంగాను, భగవంతునిచే నిర్మలమైన జ్ఞానాన్ని పొందిన ఈ దివ్యసూరి ఒక ఒక విధంగా పలకడాన్ని ఏ విధంగా మనం అర్థం చేసుకోవాలి? ఈ రెండిటిని ఏ రీతిలో సమన్వయం చేసుకోవాలి? అనే ప్రశ్నకు మన పూర్వాచార్యులు చక్కని సమాధానాన్ని చెబుతూ, రెండు విధాలుగా కనిపించే ఈ ఒకే లీలను భిన్న భిన్న

కల్పాలలో భగవానుడు ప్రదర్శించినట్టుగా భావించాలి –అని యుక్తమైన సమాధానాన్ని చెప్పారు.

శ్రీకృష్ణుని నోటిలో యశోద సమస్త భువనాన్ని దర్శించింది. నోటిలో ఈ భూమండలం, భూమండలం, లోపల భరతభూమి, భరతభూమి లోపల రేపల్లె గ్రామం, ఆ రేపల్లె గ్రామంలో మన్ను తిన్న శ్రీకృష్ణుడు, అతనిని ప్రశ్నిస్తున్న యశోద –అనే ఈ సన్నివేశాన్ని అంతటిని యశోదాదేవి చూచింది. చాలా ఆశ్చర్యపడినది. "ఆయర్ పుత్తిరనల్లన అరుమ్ దైవమ్" అని "ఇతడు సామాన్య గోప బాలుడు కాడు, సాక్షాత్తు పరదైవమే" అని భావించింది.

శ్రీకృష్ణుడు ఈ విషయాన్ని గమనించాడు. " నా దైవత్వాన్ని ఆమె తెలిసికొన్నట్లయితే, నన్ను తనకు దూరంగా ఉంచుతుంది. నన్ను పరదైవంగా భావిస్తుంది తప్ప తన కుమారునిగా భావించదు. ఆమె వాత్సల్యాన్ని అనుభవించే అవకాశం నాకు ఉండదు. అందువల్ల ఆమెకు ఈ సత్యం గుర్తు లేకుండా చేయాలి" అని తలచి, ఆ దృశ్యాన్ని ఆమె మరిచిపోయేటట్లుగా చేశాడు.

ఈ లీల ద్వారా భగవానుడు ఏమి చేశాడు? అంటే, లోకాలన్నీ తనలోనే ఉన్నాయి– అని తెలియజేశాడు. ఇంతకు ముందు వన్నింపబడిన లీలలో శ్రీకృష్ణ భగవానుడు తన అంతర్యామిత్వాన్ని తెలియజేయగా, ఈ లీలలో తన బహిర్వ్యాప్తిని తెలియజేశాడు. లోకాలను అన్నిటినీ తన నోటిలో సాక్షాత్కరింపచేసి, "అన్ని వస్తువులు సమస్త విశ్వం తనలోనే ఉన్నాయి, తాను వాటికి బయట వ్యాపించి ఉన్నాడు" అనే సత్యాన్ని తెలిపాడు. ఈ రెండు లీలల తత్త్వాన్నిఏ "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అనే వేదవాక్యం తెలుపుతున్నది.

శ్రీకృష్ణ భగవానుడు ఇంతకుముందు లీలలో సమస్త విశ్వాన్ని ధరించేది తానే –అని తెలియజేశాడు. ఆ లీలతో తాను అన్నింటి లోపల వ్యాపించి ఉండడాన్ని, నియమించడాన్ని తెలియజేయగా, ఈ లీలలో సమస్తాన్ని తాను ధరించే విషయాన్ని తెలిపాడు. ఈ విధంగా ఈ రెండు లీల ద్వారా, భగవంతుని శేషిత్వం నిరూపింపబడింది.

ఇంతకు ముందు ప్రస్తావింపబడిన లీల, ఈ లీల– ఈ రెండూ కూడా శ్రీవిష్ణు సహస్రనామాలలోని "అణుః, బృహత్ ", అనే రెండు నామాల తత్త్వాన్ని తెలియజేస్తున్నాయి. ఈ విషయం, ఈ రెండు నామాలకు శ్రీ పరాశర భట్టర్ వారు అనుగ్రహించిన వ్యాఖ్యానాన్ని గమనించినప్పుడు అర్థం అవుతుంది.

"అణిమాద్యధిష్ఠానమ్ అతిప్రకృష్ట మైశ్వర్యమ్ అతిసూక్ష్మదహరాశ వ్యక్త జీవానుప్రవేశ సామర్థ్యాత్" అనేది ", అణుః "అనే నామానికి వారు చేసిన వివరణం. దీనిని తాత్పర్యం ఏమంటే, మిక్కిలి సూక్ష్మాలైన దహరాకాశం, అవ్యక్తం అనబడే మూల ప్రకృతి, అణుస్వరూపుడైన జీవుడు మొదలైనవాటిలో కూడా అంతః ప్రవేశం చేయగలిగిన సామర్థ్యాన్ని కలిగినవాడు, కనుక "అణుః" అనే నామం చేత చెప్పబడుతున్నాడు– అని. ఇందువల్ల ముందు లీలలో "అణోరణీయాన్ ––ఆత్మా గుహాయామ్ నిహితోస్య జంతోః" అనే శ్రుతిలోని అర్థం అనుసంధింపబడింది.

తన నోటిలో సమస్త విశ్వాన్ని ఉన్నట్లు ప్రదర్శించడం ద్వారా శ్రీకృష్ణ భగవానుడు "బృహత్" అనే నామంలోని అర్థాన్ని ప్రదర్శించాడు. ఈ నామాన్ని భట్టర్ వారు "వ్యాప్త్యా విపులపరమవ్యోమామాది చుళుకీకృత్య అతిమహతా మహిమ్నా బృహత్" అని వివరించారు. తన సర్వవ్యాప్తి అనే గుణంతో అతి విస్తృతమైన పరమ పదం అనబడే త్రిపాద్విభూతిని కూడా ఆపోశనం పట్టగలిగిన గొప్ప విస్తారాన్ని భగవానుడు కలవాడు –అని ఈ వ్యాఖ్యానంలోని తాత్పర్యం. దీనికి ప్రమాణంగా వారు "స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠత్ దశాంగులమ్" (ఆ విశ్వపురుషుడు భూమిని అంతటినీ ఆవరించి ఉన్నాడు దానికి పది రెట్లు ఎక్కువ విస్తృతిని కలిగే ఉన్నాడు) , " మహతో మహీయన్" (గొప్పవి అనబడే కాలం ఆకాశం మొదలైన వానికంటే కూడా గొప్పవాడు) అనే వేద వాక్యాలను ఉదాహరించినందున, ఈ వాక్యాల తాత్పర్యమే తన నోటిలో శ్రీకృష్ణుడు సమస్త విశ్వాన్ని దర్శింపచేసిన లీలలో వ్యక్తమవుతున్నది –అని మనం భావించవచ్చు.

ప్రకృతం ప్రస్తావింపబడిన లీలలో శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలోని "భయనాశనః" అనే నామంలోని అర్థం తెలుపబడిందని కూడా చెప్పవచ్చు. యశోదా దేవి శ్రీ కృష్ణుని వాత్సల్య భక్తితో ఆరాధించింది. ఏ విధంగా, ఏ విధమైన భావనతో, తనను దరిచేరినప్పటికీ భగవంతుడు భక్తులను వదిలిపెట్టడు. వారికి కలిగే భయాన్ని తప్పక తీరుస్తాడు. శ్రీకృష్ణుడు వెన్నను తిన్నాడు అనే మాటను వినగానే తల్లి అయిన యశోదా దేవికి మనసులో చాలా భయం కలిగింది. " అయ్యో! కుర్రవాడు మట్టిని తిన్నాడు. ఇతనికి ఏమవుతుందో! ఏమో! " అనే భయం ఆమెకు కలిగింది. ఈ విధంగా పరమ భక్తురాలైన ఆమెలో కలిగిన భయాన్ని శ్రీకృష్ణ భగవానుడు పోగొట్టాలని భావించాడు. వెంటనే తాను సామాన్య బాలుడను కాదని, సమస్త విశ్వాన్నే తనలో అంతర్భవించుకున్న భగవంతుని అవతారరూపమే తాను– అనే

విషయాన్ని తెలియజేసి, ఆమెకు కలిగిన భయాన్ని తీర్చాడు. ఇందువల్ల ఈ లీల "భయనాశనః"అనే నామంలోని తాత్పర్యాన్ని తెలుపుతున్నది.

అంతేకాదు, విశ్వరూపుడైన భగవానుడు తాను ప్రేమించినవారికే తనయొక్క స్వరూపరూప గుణ విభూతిలీల సాక్షాత్కారాన్ని కలిగిస్తాడు–< అనే సత్యం కూడా ఇక్కడ తెలియజేయబడింది. " "యమేవైష వృణుతే తేన లభ్యః", అని వేదం కూడా ఈ అర్థాన్ని తెలిపింది. ఆళ్వారుల దివ్య ప్రబంధాలు అన్నీ ఈతత్వాన్ని తెలుపుతున్నాయి. తనను ఎంతగానో ప్రేమించిన యశోదను అనుగ్రహించి, బాహ్య నేత్రాలతో చూడడానికి సాధ్యం కాని తన విశ్వరూపాన్ని యశోదను కటాక్షించి, ఆమె బాహ్యనేత్రాలకే గోచరించేటట్లు అనుగ్రహించాడు. విశేషం ఏమంటే, అర్జునుని కటాక్షించిన ఈ శ్రీకృష్ణ భగవానుడే, తన విశ్వరూపాన్ని దర్శించడం కోసం ఆ అర్జునునకు "దివ్యం దదామి తే చక్షుః" అని అంటూ అలౌకికమైన నేత్రాన్ని ప్రసాదిచిన తరువాతనే తన విశ్వరూపాన్ని దర్శింప చేశాడు. యశోద విషయంలో అయితే, అంత దూరం వెళ్ళనక్కరకుండా, ఆమె బాహ్యచక్షువులకే తన విశ్వరూప దర్శనాన్ని అనుగ్రహించాడు.

భగవంతుడు అవతారాలలో తన సంకల్పంతో సులభుడుగా ఉన్నప్పటికీ, తన విశ్వరూపాన్ని విడవకుండానే ఉంటాడు. ఆ స్వామికి కల మహిమలు అన్నీ అవతార రూపాలలో కూడా ఉంటాయి. ఈ విషయాన్ని "ప్రకృతిం స్వామధిష్ఠాయ" అనే గీతాసూక్తిలో సాక్షాత్తు ఆ భగవానుడే తెలియజేశాడు కదా. అటువంటి తన తత్త్వాన్ని విశ్వరూప ప్రదర్శనలో భగవంతుడు వ్యక్తం చేశాడు తాను బాలుడై ఉన్నప్పటికీ, పరత్వంతో కూడి ఉంటాను – అనే సత్యాన్ని ఈ లీలలో తెలిపాడు.

శ్రీకృష్ణుడు చిన్న బాలుడు. అతని నోరు చాలా చిన్నది. ఆ చిన్న నోటిలో సమస్త విశ్వం ఇమిడి ఉన్నది ఇది లోకదృష్టిలో అఘటిత ఘటన. "తర్కాప్రతిష్టానాత్" అని అంటూ బ్రహ్మ సూత్ర గ్రంథం భగవంతుని తత్వం మన తత్వ తర్కాలకు అందనిది అని చెప్పింద. అందువల్ల భగవంతుని తత్త్వం అనేది మన యుక్తులకు కానీ, మన జ్ఞానానికి కానీ అందనిది– అనే సత్యం కూడా ఈ లీలలో వ్యక్తమవుతున్నది. "పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" అని వేదం భగవంతుని శక్తి గొప్పది, అనేక విధాలయినది సహజ సిద్ధమైనది, ఆ విధంగానే, ఆ స్వామికి కల జ్ఞానం, బలం, క్రియా సామర్థ్యం అనేవి కూడా గొప్పవి, వివిధాలైనవి, సహజ సిద్ధమైనవి –అని తెలిపింది. ఈ శ్రుత్యర్థమే ప్రకృతలీల లో ప్రదర్శింపబడింది.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 9

## నవనీతచౌర్యమ్

రేపల్లెలోని బాలకృష్ణుని చిలిపి పనులు అతని వయస్సుతో పాటు పెరగసాగాయి. అతడు రేపల్లెలో ఉండే అందరి ఇళ్లలోనూ దొంగతనంగా వెన్నను, పాలను, పెరుగును తినడం ఆరంభించాడు. ఈ లీల మధురమైనది. వేదాంతపరమైన, సాంప్రదాయికమైన రహస్యాలను సూచిస్తున్నది. అవాప్త సమస్త కాముడైన భగవంతుడు ఈ విధంగా శ్రీకృష్ణుడుగా అవతరించి, దొంగతనంగా రేపల్లెలో వెన్న మొదలైన ద్రవ్యాలను హరించి భుజించడంలో ఉండే వేదాంతతత్త్వం చాలా అందమైనది, అద్భుతమైనది కూడా.

గోపికలు శ్రీకృష్ణునకు అందనంత ఎత్తులో ఉండే ఉట్టెలలో పెట్టిన కుండలలో పాలు, వెన్న పెరుగు మొదలైన వస్తువులను దాచి పెట్టారు. వాటిని కూడా శ్రీకృష్ణుడు, ఎవరికి తెలియకుండా తన స్నేహితులతో కలసి వచ్చి దొంగిలించి ఆరగించాడు.

ఇక్కడ కుండలు అంటే, మన శరీరాలే. కుండలు –మన్ను, ఇసుక, నీరు అనే మూడు ద్రవ్యాలతో నిర్మింపబడేటట్లే, మన ప్రాకృత శరీరాలు కూడా సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలతో నిర్మింపబడినదిగా ఉంటుంది. ప్రకృతి త్రిగుణాత్మకమైనది కదా. అందుచేత వేదాంత రీతిలో చూసినప్పుడు, కుండలు అంటే మన శరీరాలే. కుండలలో పెట్టబడిన వెన్న అంటే, మన శరీరాలలో ఉండే జీవాత్మయే, మనసే. వెన్న తెల్లగా ఉంటుంది. ఆ విధంగానే మన మనసును కూడా తెల్లగా చేసికోవాలి, అంటే, మనసులో సాత్విక గుణాన్ని పెంపొందించుకోవాలి. ఆ విధంగా మనసును పవిత్రంగా చేసుకున్నప్పుడు, మన మనసును ఆ భగవానుడు ఆదరంగా స్వీకరిస్తాడు. గోదాదేవి కూడా "తూయోమాయ్ వందోమ్" (పవిత్రులమై వచ్చాము) అని అంటూ భగవంతుని దరిచేరేటప్పుడు మనసును పవిత్రంగా పెట్టుకోవాలని తెలియజేసింది. అప్పుడే మనసును భగవంతుడు స్వీకరిస్తాడు. మనసును పవిత్రంగా పెట్టుకోవడం అంటే, భగవంతుడే ఉపాయం అని, ఆ భగవంతుని ఆనందం కోసం చేసే ఆ స్వామి సేవయే మనం పొందదగిన ఫలం అని భావించడమే. రేపల్లెలో ఉండేవారు అందరూ శ్రీకృష్ణునిపై అమితమైన ప్రేమను కలిగినవారు కద. ఆ స్వామిని అనన్యమైనభావనతో కొలిచేవార, అందువల్ల వారి మనసు పరమ పవిత్రమైనది, తెల్లని, మధురమైన వెన్నవంటిది. అటువంటి భక్తుల మనసులను ఆదరంగా ఏ విధంగానైనా సరే గ్రహించాలని భగవానుడు ప్రయత్నం చేసి, ఆ భక్తులకు తెలియకుండా కూడ ఆకర్షించి

గ్రహిస్తాడు. అమల నాదిపిరాన్ ప్రబంధంలో తిరుప్పాణ్ ఆళ్వార్లు ఈ లీలనుగూర్చి ప్రస్తావన చేస్తూ "కోవలనాయ్ వెణ్ణెయ్ ఉండ వాయన్ ఎన్నుళ్ళమ్ కవర్ న్దానై" (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడైన స్వామి నా మనసును ఆ లీలతో అపహరించాడు) అని అన్నారు. శ్రీకృష్ణుడు కేవలం వెన్నను తినడం కోసం మాత్రం కాదు, నా వంటి భక్తుల మనస్సులను ఆ లీలతో ఆకర్షించే గ్రహించడం కోసమే ఈ విధమైన లీలను చేశాడు– అని వారు అన్నారు. " శ్రీకృష్ణుడు రేపల్లెలో వెన్నను దొంగిలించాడు" అనే ఈ లీలను వినగా వినగా, మనస్సులో భావన చేయగా చేయగా, ఆ స్వామి పై మనకు అంతు లేని ప్రీతి భక్తి కలుగుతుంది. అటువంటి, భక్తితో పరిమళించే భక్తుల మనసులను ప్రీతితో గ్రహించడమే శ్రీకృష్ణుడు రేపల్లెలో వెన్నను దొంగిలించడంలో సూచింపబడింది. " ఏ విధంగా నేను వెన్నను అపహరిస్తున్నానో, ఆ విధంగానే భక్తుల మనసులను కూడా ఆకర్షించి గ్రహిస్తున్నాను" అని సూచించడమే ఇందులోని తత్త్వం.

మన మనసును నవనీతంవంటిది. నవనీతం అంటే, వెన్న. పాలు పరిణామం పొందితే వెన్న అవుతుంది. పాలను కాచి, పెరుగుగా చేసి, ఆ పెరుగును చిలికినప్పుడు కదా వెన్న వస్తుంది. అదేవిధంగా, మన మనస్సు కూడా క్రమక్రమంగా పరభక్తి పరజ్ఞాన పరమ భక్తుల దశలను పొందినది కావాలి. వెన్నవలె పరిపక్వం కావాలి, మెత్తనిదై ఉండాలి, మధురంగా ఉండాలి. ఇది అంతా, భక్తి పరిణామాన్ని పొందినప్పుడే సంభవిస్తుంది. అప్పుడే మన మనసును భగవానుడు, నవనీతాన్ని స్వీకరించినట్లు, స్వీకరిస్తాడు.

"ఈ మనసు మనది కదా, భగవంతుడు దానిని, మనం సమర్పించకుండానే, తానే స్వీకరించవచ్చునా? ఈ విధంగా భక్తుల మనసు అనే వెన్నను దొంగతనంగానే అపహరించాలా? అనే సందేహం కలుగవచ్చు. వాస్తవం ఏమంటే, ఈ జీవుడు సహజంగా, అహంకార మమకారాలతో కూడిన మనసును కలవాడై ఉంటాడు. కనుక భగవంతునకు తన మనసును అర్పించడానికి ఏనాడూ సిద్ధపడడు. " ఇది నా మనసు, ఇది నా దేహం "అనే భావనయే ప్రబలంగా ఉంటుంది. " నా ఇల్లు, నా సొత్తు, నా సంపద" అని అంటూ అన్నిటి మీద మమకార భావనను కలిగి ఉంటాడు ఇది తొలగిపోతే గాని భగవంతునకు మనం మనసును సమర్పించే దశ కలుగదు కదా. రేపల్లెలోని గోపికలు పాలు పెరుగు మొదలైన ద్రవ్యాలను శ్రీకృష్ణుని వంద కుండా ఎత్తులో పెట్టి దాచడంలో ఉండే రహస్యం ఇదే. నమ్మాళ్వార్లు కూడా, "యానే ఎన్దనదే ఎన్ఱిరుందేన్, యానే నీ, ఎన్నుడైమైయుమ్ నీయే" (స్వామీ! నేను, నాది అనే భావనతో ఉన్నాను. వాస్తవానికి, నేను, నా సొత్తు అంతా కూడా

నీదే కదా) అని అన్నారు. ఈ విధంగా ఈ జీవుడు "నేను, నాది" అనే భావనతో ఉంటాడు. కనుక, సహజంగా భగవంతునకు తన మనస్సును, ఆత్మను సమర్పించటానికి ఎంత మాత్రం సిద్ధపడడు. అప్పుడు భగవంతుడు "నీవు నీ మనసును, ఆత్మను నాకు ఇవ్వడానికి సిద్ధపడటం లేదు. వానిని నేనే గ్రహిస్తాను" అని దానిని అపహరిస్తాడు.

అయితే, ఈ మనస్సు భగవంతునికే చెందినది అయినప్పుడు, దానిని భగవంతుడు స్వీకరించినప్పుడు, " వెన్నను అపహరించిన భగవంతుని దొంగ" అని చెప్పవచ్చునా? శ్రీకృష్ణుని నవనీతచోరుడు అని అనవచ్చునా? అనే సందేహం రావచ్చు. వాస్తవానికి, రేపల్లెలోని వెన్న అయినా, భక్తుల మనసు అయినా, ఆత్మ అయినా, ఏదైనా, భగవంతుని సొత్తే కదా. భగవంతుడు తన సొత్తును తానే స్వీకరించినప్పుడు మరి అతనిని దొంగతనం చేసినట్లుగా చెప్పడంలో ఏమి అర్థం? చోరుడు అని అనడంలో తాత్పర్యం ఏమి? అంటే, ఇక్కడ ఒక రహస్యం ఇమిడి ఉన్నది.

శ్రీకృష్ణ భగవానుడు వెన్నను తిన్నందువల్ల నో, లేక, మన ఘనంగా మనసును అపహరించడం వల్లనో అతడు దొంగగా చెప్పబడడం లేదు. మరి, ఆ స్వామి దేనిని అపహరిస్తున్నాడు? ఎందువల్ల చోరుడుగా చెప్పబడుతున్నాడు? అని అంటే, వెన్నను, భక్తుల మనసులను గ్రహించడంతో పాటు ఇంకొక వస్తువును కూడా ఆ స్వామి అపహరిస్తున్నాడు. అది ఏమిటంటే, మనంచేసిన పాపాల సమూహమే అందువల్లనే అతడు చోరుడుగా చెప్పబడుతున్నాడు. ఆ పాపాలను లేకుండా చేసేటప్పుడు మనకు తెలియకుండానే వాటిని లేకుండా చేస్తాడు. అందువల్ల చోరుడు అనబడుతున్నాడు. పాపాలు మన సొత్తా? అని ప్రశ్నిస్తే, అవి మన సంపాదించిన సొత్తే కదా. జన్మ జన్మలుగా మనం కూడపెట్టుకున్నదే కదా, పాప సమూహం. రుక్మిణీశవిజయమ్ అనే గ్రంథంలో వాదిరాజ తీర్థులు అనే మహనీయులు ఈ వృత్తాంతాన్ని ప్రస్తావిస్తూ, "స్వభక్త బృందార్జితపాపరాశిం దివానిశం చాహరతి స్మ బాలః" – తన భక్తబృందం గతంలో జన్మ జన్మలు సంపాదించుకున్న పాపాలను అన్నిటిని రాత్రి పగలు బాలకృష్ణుడు అపహరిస్తున్నాడు) అని అన్నార. శ్రీకృష్ణుడు రాత్రి పగలు రేపల్లెలో వెన్నను దొంగలించడంలో ఉండే రహస్యం ఇదే. అందువల్లనే అతడు చోరుడు అని చెప్పబడుతున్నాడు. శ్రీకృష్ణుడు వెన్నను దొంగలించిన వృత్తాంతాన్ని ఎవరు భక్తితో ఆలకిస్తారో భావన చేస్తారో, వారి పాపాలను భగవానుడు హరిస్తాడు. వెన్నను దొంగిలించిన వృత్తాంతాన్ని విన్న భక్తుల పాపా సమూహాన్ని శ్రీకృష్ణుడు అపహరిస్తాడు.

ఈ విధంగా వెన్న అనేది జీవాత్మను, ఆ జీవాత్మ మనసును తెలియజేస్తుంది. జీవాత్మలో పరిణామం కలగాలి, పరిపక్వత కలగాలి, మనస్సు మెత్తని వెన్నవలె ఉండాలి ఆ విధంగా ఉన్నట్లయితే, శరీరం అనే కుండలో ఉండే, పరిణామాన్ని పొందిన, మెత్తని, మృదువైన, మధురమైన వెన్నవంటి మనసును, ఆత్మను ఆ భగవానుడు స్వీకరిస్తాడు.

"తదహం భక్త్యుపహృత మశ్నామి" అని గీతలో– భక్తితో సమర్పించిన ద్రవ్యాన్ని కదా, ప్రీతితో స్వీకరిస్తాను – అని అన్నాడు. రేపల్లెలోని గోపికలు శ్రీకృష్ణ బాలునకు వెన్నను శ్ ఇవ్వకుండా దాచి పెట్టారు. మరి, తనకు ఇవ్వని వెన్నను శ్రీకృష్ణుడు ఎందుకు ఏవిధంగా స్వీకరించాడు? అనే ప్రశ్న కూడా కలుగవచ్చు. భగవానుడు "ప్రేక్ష్యే కంచిత్ కదాచన" అని అంటూ తన నిర్హేతుక కటాక్షంతో ఎప్పుడో ఒక సమయంలో, ఎవరినో ఒకనిని అనుగ్రహిస్తాను– అని అన్నాడు. ఆ విధంగానే, ఇక్కడ గోపికలు సమర్పించకపోయినప్పటికీ, వారిని అనుగ్రహించడంకోసం వారు, దాచి పెట్టిన పాలు, వెన్న, పెరుగులను కోరి, నిర్హేతుక కృపతో పరిగ్రహించాడు. వారిని కటాక్షించాడు.

అంతేకాక రేపల్లెలోని గోపికలు అందరూ శ్రీకృష్ణుని విషయంలో ఎంతో ప్రీతిని కలవారు అయినప్పటికీ, అతనికి వెన్నను ఇవ్వడానికి ఇష్టపడలేదు. శ్రీకృష్ణనకు అందనంత ఎత్తులో దాచి పెట్టారు. ఎందువల్ల అంటే, ఆ వెన్నను శ్రీకృష్ణుడు భుజిస్తే అతనికి ఏమవుతుందో! ఏమో! అనే అతిశంకచేత. ఆతనికి ఏ ఆపద కలుగకూడదు అనే ఉద్దేశం చేత, ఆ విధంగా వెన్నను వారు దాచి పెట్టారు. ఎందుకు? ప్రీతి ఉన్నప్పుడు ఇవ్వాలి కదా! అని అంటే, ఇందులోని తత్త్వం ఏమంటే, పరమ భక్తులైన నమ్మాళ్వారులవంటి వారు తమ శరీరాన్ని ఆత్మను మనస్సును భగవంతుడు కోరినప్పటికీ కూడా, తాము భగవంతుని దరి చేరినట్లయితే, ఆ స్వామికి అవద్యం కలుగుతుంది అని సంకోచించి దూరమయ్యారు. ఈ విషయం తిరువాయ్ మొழி ప్రబంధంలోని " వళవేழுలకు " (1–5) అనే దశకంలో తెలుపబడింది. ఈ రహస్యమే ఇక్కడ సూచింపబడింది. కనుక, శ్రీకృష్ణునకు అందకుండా దాచి పెట్టిన వెన్నను కూడా ఆ స్వామి ఆశపడి గ్రహించడం అనేది, భక్తులు అతిశంకతో తనకు దూరమైనప్పటికీ వారిని బలవంతంగా అయినా, అపహరించి అయిన వారి ఆత్మను, వారి ఆత్మీయాలను పరిగ్రహిస్తాడు– అనే విషయానికి సూచకమని చెప్పవచ్చు.

మరొక విశేషాన్ని కూడా ఇక్కడ గమనుంచవచ్చు. "సర్వోపనిషదా గావః" అని ఉపనిషత్తులే గోవులుగా రూపొందాయి అని చెప్పబడుతున్నది. గోపికలు గోవుల పాలను, పెరుగును, వెన్నను ఇతరులకు అమ్మి జీవించే ప్రవృత్తిని కలవారు. ఇక్కడ పాలు, పెరుగు,

వెన్న మొదలైనవి గోవులనుండే ఉత్పత్తి అవుతున్నాయి. అందుచేత, ఇవి ఉపనిషత్తులో ప్రతిపాదింపబడిన భగవంతుని స్వరూప రుణవిభూతులను తెలుపుతున్నాయి అని చెప్పవచ్చు. పాలు, పెరుగు మొదలైనవానిని తాము అనుభవించి, ఇతరులకు విక్రయించి, అందించే గోపికలు భగవానుని స్వరూపరూపాదులను తాము అనుభవించి, వానిని ఇతరులకు అనుభవింప చేసే మహనీయులవంటివారు. అందుచేత, గోపికలపై భగవంతునకు అంతటి ఆదరం కలిగింది.

గోపికలు పాలు, పెరుగు, వెన్న మొదలైనవానిని తగిన మూల్యాన్ని విక్రయిస్తున్నారే తప్ప, ఉచితంగా ఇవ్వడం లేదు. ఆ విధంగానే, మహనీయులైన ఆచార్యులు కూడా మననుండి ఒక మూల్యాన్ని పరిగ్రహించి, మనకు భగవంతుని అనుభవాన్ని కలిగిస్తారు. ఆ మూల్యం ఏమంటే, ఆశయే. భగవంతునిపై ఆశయే, ఆ భగవంతుని స్వరూప స్వరూప గుణాలను పొందాలనే ఆశయే. "ఆశైయుడైయోర్ క్కెల్లామ్ ఆరియర్ గాళ్ కూరుమ్" (ఓ ఆచార్యులారా! భగవంతునిపై ఆశను కలిగినవారికి అందరికీ ఉపదేశించండి) అని ఆశను కలిగి ఉండడం అనేది భగవదనుభవాన్ని పొందడానికి యోగ్యతగా శ్రీరామానుజులు చెప్పారు కదా.

గోపికలు తమ చేతులతో పాలను కాచి, పెరుగును తచిలికి, వెన్నను తీశారు. వారి హస్తస్పర్శను కలిగిన వీటిని శ్రీకృష్ణ భగవానుడు పరమ భోగ్యంగా భావించి స్వీకరించాడు. ఇది భక్తుల సంబంధాన్ని కలిగిన ఏ వస్తువును అయినా, భగవానుడు ప్రీతితో స్వీకరించడాన్ని తెలియజేస్తున్నది.

ఇక్కడ ఇంకొక రహస్యం కూడా ఇమిడి ఉన్నది. శ్రీకృష్ణుడు వెన్నను దొంగిలించినప్పుడు, ఆ వెన్నను తాను ఒక్కడే తిన్నాడా? అని అంటే, తాను ఒక్కడుగా తినలేదు. తనతో పాటు పలువురు స్నేహితులైన గోపబాలకులను కలుపుకొని, వారికి కూడా తాను గ్రహించిన వెన్నను ఇచ్చాడు– అని పురాణాలలో తెలుపబడింది. ఇందులోని మర్మం ఏమి? అని అంటే, భగవంతుడు ఒక జీవాత్మను పొందగలిగితే, ఆ జీవాత్మను అతడు మాత్రమే తనకు మాత్రమే శేషంగా చేసుకోవడం కాకుండా, తన భక్తులకు కూడా ఆ జీవాత్మను శేషభూతునిగా చేస్తాడు – అనే తత్త్వం ఇక్కడ సూచింపబడింది. భగవానుడు తాను పరిగ్రహించిన జీవాత్మను తన భక్తులకు కూడా దాసునిగా చేస్తాడు. "అడియార్ క్కు ఎన్నై ఆట్పడుత్త విమలన్" (తన భక్తులకు నన్ను శేషంగా చేసిన పరమ పవిత్రుడు) అని అన్నారు తిరుప్పాణ్ ఆళ్వార్లు. నమ్మాళ్వారులు, పెరియాళ్వార్లు, శ్రీరామానుజులు,

శ్రీమణవాళ మహామునులు, వేదాంతదేశికులవంటి ఆచార్యవర్యులకు మనలను దాసభూతునిగా చేస్తాడు. తన భక్తులకు ఇష్టవినియోగమైన శేషవస్తువుగా మనలను చేస్తాడు. అందువల్ల, ఇక్కడ వెన్న అంటే, భక్తుని జీవాత్మయే. శ్రీకృష్ణ భగవానుడు వెన్నను గ్రహించడం అంటే, ఒక భక్తుని గ్రహించి, . ఆ విధంగా తాను గ్రహించిన జీవాత్మను తన భక్తులకు కూడా శేషంగా చేయడమే. అప్పుడే జీవుని శేషత్వపారతంత్ర్యాలనేవి ల పరాకాష్ఠను, వ పరమావధిని పొందినట్లు అవుతుతాయి ఇది ఈ వృత్తాంతంలోని రహస్యం. అందువల్లనే మనం ఆళ్వార్ తిరువడిగళే శరణమ్, ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమ్, జీయర్ తిరువడిగళే శరణమ్" అని భగవద్భక్తులైన అళ్వార్లకు, ఆచార్యులకు శేషంగా మనలను నిత్యం భావిస్తున్నాము.

★★★★★

# శ్రీకృష్ణలీలలలోని వేదాంత తత్త్వాలు - 10

భగవానుడు శ్రీకృష్ణుడుగా ద్వాపర యుగాంతంలో అవతరించిన సంగతి అందరికీ తెలిసినదే. ఆ స్వామి పుట్టిన క్షణం నుండి అవతారం చాలించే వరకు చేసిన లీలలు అన్నీ అమూల్యమైన, మనం అందరం గ్రహించవలసిన వేదాంత తత్త్వాలను ఆవిష్కరిస్తున్నాయి అని అభిజ్ఞులైన మన పూర్వాచార్యులు తెలియజేశారు. వాటిలో కొన్ని మాత్రం ఇక్కడ విజ్ఞాపన చేయబడుతున్నాయి.

1) పూతనామోక్షం

కంసుడు పంపగా రేపల్లెకు వచ్చిన పూతన విషాన్ని కలిపిన పాలను ఇచ్చి శ్రీకృష్ణుని సంహరించాలని ప్రయత్నించింది. ఆమె ఇచ్చిన విషమిశ్రితమైన పాలతో పాటు ఆమె ప్రాణాలను కూడా గ్రహించి, ఆ పూతనను శ్రీకృష్ణుడు వధించాడు.

ఈ వృత్తాంతంలోని తత్త్వం ఏమి? పూతన అంటే అవిద్యయే. అవిద్య అనబడే అజ్ఞానం మన పూర్వ కర్మల వల్ల ఏర్పడుతున్నది. మనకు సహజంగా ఉండే జ్ఞానాన్ని అంతటినీ ఆవరించి, జన్మ బంధంలో మనం చిక్కుకునేటట్లు చేస్తున్నది. ఆమెకు కల రెండు వక్షోజాలు మనకు ఏర్పడే అహంకార మమకారాలే. ఈ రెండు మనకు చాలా తీయగా తోస్తాయి. కానీ, అవి విషంవంటివి. వీటి నుండి మనం బయటపడాలంటే ఏమి దారి? అంటే, మనం శ్రీకృష్ణ పరమాత్మ యొక్క శ్రీచరణాలను ఆశ్రయించినట్లయితే, అతడు, పూతనకు గల రెండు వక్షోజాల పాలతో పాటు ఆమె ప్రాణాలను కూడా పీల్చి, ఆమెను వధించినట్లుగా, మన అహంకార మమకారాలను పూర్తిగా పీలుస్తాడు. పూతనను వధించినట్లుగా మన అవిద్యను లేకుండా చేస్తాడు.

2) శకటాసురవధం

కంసునిచే పంపబడిన శకటాసురుడు అనే అసురుడు బండిరూపంలో వచ్చి శ్రీకృష్ణునిపై పడి అతనిని వధించాలని ప్రయత్నం చేశాడు. కానీ, "పొన్దచ్చగడ ముద్దైత్తాయ్" అని గోదాదేవి పలికినట్లుగా తన శ్రీచరణాలతో ఆ శకటాసురుని తాకి, సంహరించాడు, శ్రీకృష్ణుడు.

ఈ వృత్తాంతంలో మనం గ్రహించవలసిన తత్త్వం ఏమి? శకటాసురుని రూపంలో ఉండేది మన జన్మ పరంపరయే. బండి గిరగిరా దొర్లుతూ వచ్చేటట్లుగా మన జన్మ పరంపర కూడా పరిభ్రమిస్తూ మన మీదకు వస్తుంది. "పునరపి జననం పునరపి మరణం "అని చెప్పినట్లుగా జన్మ మరణ చక్రం నిరంతరంగా కొనసాగుతుంది. శ్రీకృష్ణుని చరణాలను మనం ఆశ్రయిస్తే, శకటం భగ్నమైనట్టుగా, ఆ సంసారచక్రం భగ్నమై, జన్మ పరంపర లేకుండా పోతుంది– అనే సత్యం ఈ వృత్తాంతంలో వ్యక్తమవుతున్నది.

3) తృణావర్త సంహారం

యశోదా దేవి శ్రీకృష్ణుని తన ఒడిలో పెట్టుకుని కూర్చుని ఉన్న సమయంలో, తటాలున ఒక సుడిగాలి రూపంలో ఒక అసురుడు వచ్చి శ్రీకృష్ణుని పైకి తీసుకొని పోయాడు. అతడే తృణావర్తుడు. ఇతడు కంసుని చేత పంపబడినవాడు. అయితే, శ్రీకృష్ణుడు క్రమక్రమంగా బరువు పెరగడం ఆరంభించాడు. అతని బరువును మోయలేక ఆ అసురుడు భూమిపై పడి చనిపోయాడు.

ఈ వృత్తాంతంలో మనకు తెలుస్తున్న తత్త్వం ఏమి? అసురులలో సహజంగా ఉండే రజోగుణమే ఈ తృణావర్తుడు. ఈ రజోగుణం వల్ల అధికమైన కోపం, కామం కలుగుతాయి. రజోగుణ స్వరూపుడైన తృణావర్తుడు శ్రీకృష్ణుని పైకి వేగంగా తీసుకుని పోయినట్లే, రజోగుణం వల్ల ఏర్పడే కామం, క్రోధం అనేవి మనకు కల సద్గుణాలను, భక్తిని మన నుండి ఒక్క క్షణంలో అపహరించుకొని పోతాయి. శ్రీకృష్ణుని చరణాలను మనం ఆశ్రయించినట్లయితే, తృణావర్తుని అతడు వధించినట్లుగా, మనకు కల రజోగుణాన్ని ఆ భగవానుడు లేకుండా చేసి, మన మనసులోని మంచి గుణాలు, భక్తి ప్రకాశించేటట్లు మనలను అనుగ్రహిస్తాడు.

4) నవనీత చౌర్యవృత్తాంతం

వెన్న అనేది మన మనసును తెలుపుతుంది. వెన్నను కల కుండ ఆ మనసును కలిగిన శరీరాన్ని తెలుపుతుంది. మన శరీరం అనే కుండనుండి మనసు అనే వెన్నను శ్రీకృష్ణుడు అపహరించే అందాన్ని తిరుప్పాణ్ ఆళ్వారులు " కోవలనాయ్ వెణ్ణెయ్ ఉండ వాయన్ ఎన్నుళ్ళమ్ కవర్ న్దానై" " గోపాలుడై వెన్నను భుజించిన నోటిని కల స్వామి నా మనస్సును అపహరించాడు) అని కీర్తించారు. "ఆనాడు రేపల్లెలో గోపికల ఇళ్లలో వెన్నను

దొంగిలించి భుజించిన స్వామి ఇప్పుడు శ్రీరంగనాథుడై శ్రీరంగంలో శయనించి ఉన్నాడు. అక్కడ రేపల్లెలో బాన ఉన్నది, వెన్న మాత్రం కనపడలేదు. ఇక్కడ శ్రీరంగంలో నా శరీరం మాత్రం ఉన్నది, నా మనసును మాత్రం కనపడలేదు. ఎందుకంటే, కుండనుండి వెన్నను శ్రీకృష్ణుడు అపహరించినట్లుగా, నా శరీరంనుండి నా మనసును ఈ శ్రీరంగనాథుడు కొల్లగొట్టాడు"— అని ఈ పాశురంలో చాలా హృద్యంగా ఆళ్వారులు పలికారు.

వెన్నవలె తెల్లని పవిత్రమైన భక్తుల మనసులను అపహరించి గ్రహించే భక్తమానసచోరుడుగా శ్రీకృష్ణుడు ప్రకాశించడాన్ని ఈ లీల ద్వారా తెలియవచ్చు. అయితే, వెన్న కాని, మన శరీరం కాని, మనసు కాని, ప్రాణం గాని, ఇవి అన్నీ అతని సొత్తే కదా. తన సొత్తును తాను గ్రహించడాన్ని ఎందుకు దొంగతనం అని చెప్పాలి? అని అంటే, శ్రీకృష్ణుడు వెన్నను దొంగిలించడం వల్ల గాని, పాలును దొంగిలించడం వల్ల గాని, మన మనసులను, ఆత్మలను దొంగలించడం వల్ల గాని అతనిని దొంగ అని మనం అనడం లేదు. మరి దేనిని ఆ శ్రీకృష్ణుడు దొంగిలిస్తున్నాడు? అని అంటే, వాదిరాజు అనే భక్తుడు ఒక శ్లోకంతో ఈ క్రింది విధంగా సమాధానం చెప్పారు.

"స్వభక్తబృందార్జిత పాపబృందం దివానిశం చాహరతి స్మ బాలః"

శ్రీకృష్ణుడు వెన్నను పాలను దొంగిలించిన వృత్తాంతాన్ని ఎవరు ఆలకిస్తున్నారో, వారి పాప సమూహాలను శ్రీకృష్ణుడు సదా అపహరిస్తున్నాడు. మనం చేసిన పాపాలు అన్ని మనం సంపాదించుకున్న సొత్తే కదా. మన సొత్తు అయిన పాపాలను అతను దొంగిలించి లేకుండా చేయడం వల్ల అతడు చోరుడు అని చెప్పబడుతున్నాడు— అని ఈ శ్లోకంలోని తాత్పర్యం.

## 5) రుక్మిణీ కల్యాణమ్

భీష్మకుని పుత్రిక అయిన రుక్మిణి శ్రీకృష్ణుని వివాహం చేసుకోవాలని కోరింది. అయితే, ఆమెకు గల ఐదుగురు సహోదరులు రుక్మి, రుక్మరదుడు, రుక్మకేశుడు, రుక్మ బాహువు, రుక్మమాలి అనే ఐదుగురు ఆమెను శిశుపాలునకు ఇచ్చి వివాహం చేయాలని నిశ్చయించారు. అప్పుడు రుక్మిణి ఒక బ్రాహ్మణుని ద్వారా శ్రీకృష్ణుని దగ్గరకు తనను పరిగ్రహించి వివాహమాడవలసినదిగా ప్రార్థిస్తూ ఒక లేఖను పంపుతూ, దానిని ద్వారకలో ఉండే శ్రీకృష్ణునకు ఇవ్వమని కోరింది. ఆ బ్రాహ్మణులడు కూడా రుక్మిణి ఇచ్చిన లేఖను తీసుకొని పోయి, శ్రీకృష్ణుని దగ్గరకు ఇచ్చాడు. ఆ లేఖ ద్వారా శ్రీకృష్ణుడు రుక్మిణి

అభిప్రాయాన్ని తెలుసుకొని వచ్చి, ఆమె సహోదరులను ఓడించి, రుక్మిణి వివాహం చేసుకున్నాడు.

ఈ వృత్తాంతంలో గ్రహించవలసిన పరమార్థం ఏమిటంటే, రుక్మిణి అంటే జీవాత్మయే. శ్రీకృష్ణుడు పరమాత్మ. శిశుపాలుడు ఈ లోకంలోని జీవనం. జీవాత్మకు తోడబుట్టినవారు ఐదుగురు ఉన్నారు, వారు, కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం అనే ఐదు ఇంద్రియాలు. రుక్మిణి అనే జీవాత్మ భగవంతుని చేరాలని కోరినప్పటికీ, ఆ జీవాత్మకు తోడబుట్టినవంటివారైన ఐదు ఇంద్రియాలు శిశుపాలుడు అనే లౌకిక జీవితంలో జీవాత్మను బలవంతంగా లాగుతారు. అప్పుడు, రుక్మిణి కోసం ఒక బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని దగ్గరకు దూతగా వెళ్లినట్లుగానే, జీవాత్మకోసం గురువు భగవంతుని దగ్గరకు దూతగా వెళ్లి, భగవంతుని అనుగ్రహాన్ని జీవాత్మ పొందేటట్లు చేస్తాడు. రుక్మిణి సహోదరులను శ్రీకృష్ణుడు జయించి ఆమెను వివాహం చేసుకొన్నట్లే, ఈ ఇంద్రియాల ప్రభావాన్ని లేకుండా చేసి జీవాత్మను భగవంతుడు స్వీకరిస్తాడు. ఈ విధంగానే శ్రీకృష్ణ పరమాత్మ చేసిన ప్రతి లీలలోను ఎంతో వేదాంతార్థాలు ఇమిడి ఉంటాయి.

6) శ్రీకృష్ణుడు రేపల్లెలో దెబ్బలు తినడం

శ్రీకృష్ణుడు ఒకరోజు ఒక గోపిక ఇంటిలోకి వెళ్లి, అక్కడ ఆమె దాచి పెట్టిన పాలను దొంగతనంగా ఆరగించాడు. శ్రీకృష్ణుడు పాలను దొంగతనంగా తాగడానికి చూసిన ఆ ఇంటి గోపిక ఒక బెత్తంతో శ్రీకృష్ణుని కొట్టింది. అప్పుడు ఏమి జరిగిందో పిళ్లై ప్పెరుమాళ్ అయ్యంగార్ అనే తమిళ కవి ఒక పాశురంలో అద్భుతంగా వర్ణిస్తారు.

కడిక్కుమ్ పిఱై వెవ్వాళ్ ఎయిற்ఱు కాళియన్ మేల్
నడిక్కుమ్ పెరియ పెరుమాళ్ తిరువరంగర్ నఱైకమழ் పాల్
కుడిక్కుమ్ కళవుక్కు మాఱు కొండు ఓర్ గోపికై పற்றి
అడిక్కుమ్ పోదు పదినాల్ ఉలగమ్ అడి ప్పట్టదే.

కరిచే, చంద్రవంక వలె చాలా పదునైన కోరలను కలిగిన కాళీయుని తలలపై నర్తనమాడిన శ్రీరంగనాథుడు శ్రీకృష్ణావతారంలో రేపల్లెలో సువాసనతో పరిమళించే పాలను దొంగతనం చేసినప్పుడు చూసిన గోపిక కోపాన్ని పొంది, శ్రీకృష్ణుని కొట్టగా, అప్పుడు 14 లోకాలకు దెబ్బలు తగిలాయి.

ఆ గోపిక శ్రీకృష్ణుని నడుము పై బెత్తంతో దెబ్బలు కొట్టగానే శ్రీకృష్ణులకు దెబ్బలు తగలలేదు, బాధ కలుగలేదు. కానీ, పాతాళ లోకం నుండి సత్యలోకం వరకు ఉండే లోకాలలో చీమల దగ్గర నుండి బ్రహ్మ వరకు ఉండే అందరూ జీవాత్మలకు ఆ దెబ్బలు తగిరాయట. శ్రీకృష్ణుని కొట్టిన ఆ గోపికకు కూడా ఆ దెబ్బలు తగిలాయట. ఈ విధంగా అందరికీ దెబ్బలు తగలడానికి కారణం ఏమి? ఇందులో ఉండే తత్త్వ ఏమి? లోకాలకు అన్నిటికీ భగవంతుడు అంతర్యామి. అందరూ ఆ పరమాత్మకు శరీరం అనే వేదాంత తత్త్వాన్ని ఇక్కడ శ్రీకృష్ణ భగవానుడు వ్యక్తం చేశాడు.

"యస్య పృథివీ శరీరం, యస్య ఆత్మా శరీరమ్" అని అంటూ చేతనా చేతనాలు అన్నీ భగవంతునకు శరీరం అనే విషయాన్ని బృహదారణ్యకోపనిషత్తు తెలుపుతున్నది. " జగత్ సర్వం శరీరం తే" అని రామాయణం తెలుపుతున్నది. "తాని సర్వాణి తద్వపుః" అని విష్ణు పురాణం అంటున్నది. "సోభిధ్యాయ శరీరాత్ స్వాత్ "అని మనుస్మృతి పలుకుతున్నది. వేదాలను ద్రావిడీకరించిన నమ్మాళ్వార్లు కూడా తిరువాయ్ మొళి ప్రబంధంలో "ఉడన్ మిశై ఉయిరెన కరందెంగుమ్ పరందుళన్" అని అన్నారు. జగత్తుకు, పరమాత్మకు మధ్య ఉండే శరీర శరీర భావం అనేది ఈ లీల ద్వారా చాలా సులభంగా తెలుసుకునేటట్లుగా శ్రీకృష్ణుడు ప్రదర్శించాడు.

7) రోటికి బంధింపబడిన కథ

రెపల్లెలో వెన్నను, పాలను, పెరుగును దొంగిలించే శ్రీకృష్ణుని చూచి యశోద కోపించి, అతనిని రోటికి కట్టి వేసింది. ఆమె కట్టిన కట్టుకు శ్రీకృష్ణుడు కట్టుబడ్డాడు. దుర్యోధనుడు మొదలైనవారు శ్రీకృష్ణుని బంధించాలని ప్రయత్నించినప్పుడు శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని ప్రదర్శించి అందరిని జయించాడు. అటువంటి శ్రీకృష్ణుడు ఒక అబల గోపిక చేతిలో కట్టుబడడానికి ఏమి కారణం? అని అంటే, తనను ప్రేమించే, అభిమానించే భక్తుల విషయంలో ఉండే ప్రేమయే కారణం. ఎవరి శౌర్య పరాక్రమాలకు, శక్తికి భగవంతుడు లొంగడు. భక్తుడు చూపించే ప్రేమకు మాత్రం సులభంగా లొంగిపోతాడు –అనే తత్త్వం ఇక్కడ ఆవిష్కరింపబడింది. దీనిని నమ్మాళ్వారులుకూడా "పత్తుడై అడియవర్ క్కు ఎళియవన్ పిఱర్ కళుక్కు అఱియ విత్తకన్ మలర్ మకళ్ విరుంబుమ్ నమరుమ్ పెఱలడికళ్, మత్తుఱు కడై వెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుండు ఎత్తిఱ మురలినోడు ఇణైందిరుందు ఏంగియ వెళివే" (భగవంతుడు భక్తిని కలిగినవారికి సులభుడు ఇతరులకు

దుర్లభుడు. లక్ష్మీనాథుడై, పరాత్పరుడై ఉండే ఆ పరమాత్మ ఒక గోపిక రోటికి కట్టిన కట్టుకు కట్టుబడి, ఆ కట్టునుండి విడిపించుకోలేక వెక్కి వెక్కి ఏడ్చిన సౌలభ్యప్రకారం, ఆహా! ఎంత గొప్పది) అని ఈ వృత్తాంతంలో భగవంతుడు ప్రదర్శించిన సౌలభ్య గుణాన్ని అనుభవించి, నమ్మాళ్వారులు ఆరు నెలల కాలం మూర్ఛ పోయారట.

8) మద్ది చెట్ల జంటను కూల్చడం

యశోదా దేవి శ్రీకృష్ణుని రోటికి కట్టి వేసింది. అప్పుడు శ్రీకృష్ణుడు ఆ రోటిని లాగుకుంటూ పాకుతూ వెళ్లడం ఆరంభించాడు. దారి మధ్యలో రెండు మద్ది చెట్లు అడ్డు వచ్చాయి. ఆ రెండు మద్ది చెట్ల మధ్య నుండి శ్రీకృష్ణుడు దోగాడుతూ వెళ్ళాడు. శ్రీకృష్ణుడు వెళ్ళగలిగాడు కానీ, అతని నడుముకు కట్టిన రోలు అడ్డుపడింది. అప్పుడు శ్రీకృష్ణుడు రోటిని బలంగా ముందుకు లాగాడు. ఆ రెండు మద్ది చెట్లు విరిగి కింద పడ్డాయి. ఆ రెండు మద్ది చెట్ల రూపంలో ఉన్నవారు కుబేరుని కుమారులైన నలకూబరుడు మణిగ్రీవుడు అనేవారు. మీరు శాపవసశంచేత ఈ విధంగా మద్ది చెట్ల రూపాన్ని పొందారు. శ్రీకృష్ణుని పాదస్పర్శను పొంది ఆ శాపం నుండి విముక్తిని పొంది, నిజస్వరూపాన్ని పొందగలిగారు. కృష్ణుని స్తుతించి వారు దేవలోకానికి వెళ్లిపోయారు.

ఈ వృత్తాంతం ద్వారా ఏ తత్త్వం వ్యక్తమవుతున్నది? అని అంటే, ఈ రెండు మద్ది చెట్లు మనకు కల కామం, క్రోధం అనే రెండు దోషాలు. ఇవి ఆ మద్ది చెట్ల వలె మన మనసులు చాలా బలంగా నాటుకుని పోయి, చాలా ఉన్నతంగా పెరిగిపోతాయి. మనం వాటిని పోగొట్టుకోవాలని ఎంతగా ప్రయత్నించినప్పటికీ, అది సాధ్యం కాదు. భగవంతుడు మన మనసులో ఉండే ఆ కామం, క్రోధం అనే రెండు మద్ది చెట్ల మధ్యలోకి వచ్చి ప్రవేశించినట్లయితే, అంటే, రెండు మహావృక్షాలుగా మన మనస్కులు పెరిగి ఉండే కామ క్రోధాల మధ్యకు వచ్చి నట్లయితే, అవి, ఆ రెండు మద్ది చెట్లు విరిగి నశించినట్లు నశిస్తాయి. ఇందులో ఏ సందేహం లేదు– అనే విషయం ఇక్కడ తెలియజేయబడింది.

9) సప్తవృషభ భంజనమ్

శ్రీకృష్ణుని మేనమామ కుంభుడు. అతని పుత్రిక నీళాదేవి. ఈమెకు ద్రావిడ భాషలో నప్పినై అని పేరు. ఈమె నీళాదేవి అవతారవిశేషంగా భావింపబడుతున్నది. తన దగ్గర ఉంది ఏడు పొగరుటెద్దులను ఎవరు స్వాధీనం చేసుకుని నియంత్రించగలుగుతారో,

వారికే తన కుమార్తెను ఇచ్చి వివాహం చేస్తానని కుంభుడు ప్రకటించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ఒక్కడే వెళ్లి, ఆ ఏడు ఎద్దులను అణచి, నీళాదేవిని వివాహం చేసుకున్నాడు.

ఈ వృత్తాంతంలో ఏ తత్త్వం వ్యక్తమవుతున్నది? అంటే, నీళాదేవి జీవాత్మ. శ్రీకృష్ణుడు పరమాత్మ. జీవాత్మకు కల ఐదు ఇంద్రియాలు, మనస్సు, శరీరం అనే ఏడు పొగరు టెద్దులు. ఇవి జీవాత్మను భగవంతుని చేరనీయకుండా అడ్డుపడతాయి. పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు ఈ ఏడు పొగరు టెద్దులను అణచి, జీవాత్మను తనను పొందేటట్లు అనుగ్రహిస్తాడు– అనే అర్థమే ఈ చరిత్రలో తెలుస్తున్నది.

10) కాళియ మర్దనమ్

కాళియుడు అనే విషసర్పం మన మనసును తెలుపుతుంది. ఎందుకంటే, పాము ఏ విధంగా వంకరటింకరగా సంచరిస్తుందో, ఆ విధంగానే, మన మనసు కూడా ఋజువుగా వెళ్ళదు. వక్రంగానే సంచరిస్తుంది. మనం ఎంత ప్రయత్నించినప్పటికీ అది మన స్వాధీనంలో ఉండదు. ఋజువుగా వర్తించదు. కాళియుడు విషాన్ని కక్కి కాళిందీ నదిలోని జలాన్ని అంతటిని ఎవరికి పనికిరాకుండా పాడు చేశాడు. ఆ విధంగానే మన మనసు అనేది చెడ్డ ఆలోచనలనే విషాన్ని కక్కి, మనలను పాడు చేయడమే కాకుండా ఇతరులకు కూడా హాని కలిగిస్తుంది.

ఇటువంటి కాళియుని వంటి సర్పాన్ని ఏ విధంగా స్వాధీనం చేసుకోవడం? శ్రీకృష్ణుని మనం మన మనసులో నిలుపుకొని భావించినట్లయితే, ఆ స్వామి, కాళీయుని తలలపై ఎక్కి నాట్యం ఆడినట్లే, మన మనసు అనే కాళియుని తలలపై నాట్యమాడి, దాన్ని మన వశం అయ్యేటట్లు చేస్తాడు.

11) గోవర్ధన పర్వతాన్ని ఎత్తడం

రేపల్లెలో ఉండే గోపాలురు అందరూ ప్రతి సంవత్సరం ఇంద్రునకు పూజ చేసి, ఆరాధించడం అలవాటు. శ్రీకృష్ణుడు వారు చేసే ఇంద్ర పూజను అడ్డుకొని, దానికి బదులుగా రేపల్లెలో ఉండే అందరికీ జీవనాధారం అయిన గోవర్ధన పర్వతానికి ఆరాధన చేయమని అన్నాడు. ఆ విధంగానే వారు ఇంద్రుని పూజించడం మానివేసి, గోవర్ధన పర్వతానికి పూజ చేశాడు. అప్పుడు ఇంద్రునకు కోపం వచ్చి రేపల్లెపై వడగళ్ల వానను కురిపించాడు. శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని తన చేతిలోని చిటికెన వేలితో పైకెత్తి గొడుగుగా పట్టుకొని, రేపల్లెలో ఉండే గోగోపి గోపజనాలను అందరినీ కాపాడాడు. వడగళ్ల వాన నుండి రక్షించాడు.

ఈ వృత్తాంతంలో ఏ తత్త్వం మనకు వ్యక్తమవుతున్నది? ఈ లోకికమైన జీవితంలో ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధి దైవికం అనే మూడు విధాలైన తాపాలు మనకు కలుగుతాయి. అవే పడగళ్ల వర్షం వంటివి. మన శరీరం వల్ల మనకు ఏర్పడే ఆపదలు ఆధ్యాత్మికం అని పేరు. దైవాల వల్ల ఏర్పడే ఆపదలు ఆధిదైవికం అని పేరు. పాములు, పులులు మొదలైన ఇతర ప్రాణుల వల్ల ఏర్పడే ఆపదలకు ఆధిభౌతికం అని పేరు. వడగళ్ల వాన వంటి ఈ మూడు విధాలైన బాధల నుండి మనకు విముక్తి ఏ విధంగా కలుగుతుంది? ఆనాడు రేపల్లెలో ఉండే అందరూ శ్రీకృష్ణుని శరణు పొందినట్లే, మనం కూడా శ్రీకృష్ణుని శరణు పొందినట్లయితే, పర్వతం వలె ఉన్నతంగా ఉండే తన కళ్యాణ గుణాలనే గొడుగుగా పట్టుకొని, వడగళ్ల వాన వంటి, మనకు ఏర్పడే ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధి దైవికాలైన తాపాలను అన్నిటినుండి రక్షిస్తాడు అనే తత్త్వమే ఇక్కడ ఆవిష్కృతమైనది.

12) రాసలీల

శరత్కాలంలో సాయంకాలం వేళ చంద్రోదయం అయిన తరువాత ఒక సంపెంగ చెట్టు సమీపంలో శ్రీకృష్ణుడు వేణుగానాన్ని చాలా మధురంగా చేశాడు. ఆ మధుర ధ్వని విన్న రేపల్లెలోని గోపికలు అందరూ పరుగు పరుగున వచ్చి శ్రీకృష్ణుని చేరారు. ఆ రాత్రివేళ శ్రీకృష్ణుడు ఆ గోపికలతో కలసి బృందావనంలో రాస క్రీడ అని చెప్పబడే ఒక అద్భుతమైన లీలను చేశాడు. గోపికలందరూ మైమరచిపోయి, శ్రీకృష్ణునితో పాటు ఆ క్రీడను ఆడి, బ్రహ్మానందాన్ని పొందారు.

ఈ లీల లోని తత్త్వం ఏమి? జీవాత్మకు, పరమాత్మకు మధ్య నవవిధ సంబంధాలు ఉన్నాయి. వీనిని మనకు అష్టాక్షరి మహామంత్రం తెలుపుతున్నదని మన పూర్వాచార్యులు వివరించారు. అవి, పితాపుత్ర భావం, రక్ష్యరక్షక భావం, శేష శేషి భావం, భర్తృభార్యాభావం, జ్ఞాతృజ్ఞేయ భావం, స్వ స్వామిభావం, ఆధార ఆధేయ భావం, ఆత్మ ఆత్మీయ భావం, భోగ్యభోక్తృభావం అనేవి. ఈ విధంగా ఉండే తొమ్మిదిది విధాలైన సంబంధాలలో అతి ముఖ్యమైన భర్తృ భార్యా భావాన్ని శ్రీకృష్ణ భగవానుడు రాసలీల ద్వారా వ్యక్తం చేశాడు.

ఈ విధంగా తాను చేసిన ప్రతి లీలలోను శ్రీకృష్ణుడు వేదాంతతత్త్వాలను వ్యక్తం చేశాడు. ఉదాహరణ కోసం కేవలం కొన్ని లీలలను మాత్రం ఇక్కడ ప్రస్తావించడం జరిగింది.

